# దక్షిణ భారత హిందీ ప్రచార సభ – ఆంధ్ర

## కార్యదర్శులు



శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణ శర్మ



శ్రీ బాలచంద్ర ఆప్టే



కేంద్ర సభ కార్యాధ్యక్షులు శ్రీ డి. శ్రీనివాస అయ్యంగార్
ఆధ్వర్యమున
విజయవాడ హిందీ ప్రేమీ మండలి నూతన కార్యవర్గం
ప్రమాణ స్వీకారం నాటి చిత్రం.

ఫోన్: 2066 టెలిగ్రామ్: హిందీసంఘ

సంపుటి 7 సంచిక 2

# స్రవంతి

తేది..............................

సాహిత్య మాసపత్రిక

*

సంపాదక మండలి:

శ్రీ మోటూరి సత్యనారాయణ, M.P. (అధ్యక్షులు)

శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు

శ్రీ పప్పూరి రామాచార్యులు

శ్రీ సి. నారాయణరెడ్డి

శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ

*

దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

959, ఖైరతాబాదు – హైదరాబాదు - 4

సంవత్సర చందా రూ. 4-00

మే 1960

విడిప్రతి 35 నయాపైసలు

Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis. No. 30/55 dated 6th January 1955.

## ఈ సంచికలో



### పంత్ అభినందన సంచిక

రాబోయే స్రవంతి ప్రముఖ హిందీకవి సుమిత్రానందనపంత్ షష్టిపూర్తి అభినందన సంచికగా సుమారు 150 పేజీలతో పంత్ ముఖ్యమైన కవిత్వముతో చక్కని ముఖచిత్రంతో వెలువడుతుంది. తమ కాపీ మీ ఏజెంటు దగ్గర నేడే రిజర్వు చేసుకోండి. లేదా వార్షిక చందా నేడే పంపండి. చందాదారులకు ఉచితం.

సంపాదకీయం :

మానవులలో కొందరు తమ లోపాలను తెలిసికొనలేని స్థితిలో ఉన్నారు. కొందరు తెలిసికొని కూడ లోపాలను సరిదిద్దుకొనలేని వారుగా ఉన్నారు. మొదటివారు తెలివి తక్కువవారూ, తెలివిలేని వారూ. తరువాత వారు తెలివి గలవారుగ, సంఘంలో ఏదో ఒక స్థానాన్ని సంపాదించుకొని ఉపదేశకులుగనో, శాసకులుగనో తయారై నారు. అందువలన మంచి చెడ్డలు మానవుణ్ణి అంటిపట్టుకొని వదిలి పెట్టక అభివృద్ధిని పొందుతున్నవి. మానవునిలో ఉన్న మంచి చెడ్డలలో మంచి మిగిలి, చెడుగు పోవలెనంటే గట్టి ప్రయత్నం చేయవలసి ఉంటుంది. దీనికి త్యాగంతో పాటు సంయమం కూడ చాల అవసరం. వీటిని అచరణలో పెట్టగలిగినప్పుడే ఉపదేశము, శాసనము సంఘంలో సార్థకము అగుట సంభవము. చెప్పుటకంటె చేయుట చాల కష్టమైన పని. మానవుడు అన్యులకు సలహా లిచ్చుటలోనే నల్లేరుపై బండి వలె నడక సాగిస్తూ ఉంటాడు. తాను చేసి, తరువాత లోకానికి చెప్పే అలవాటు చాల అరుదు. అది అవతార పురుషులలో అనగా గాంధీ మహాత్ముని వంటి ఉత్తమ పురుషులలో అప్పుడప్పుడు కనిపిస్తూ ఉంటుంది ఈ లోకానికి.

ప్రస్తుత విద్యా విధానము మంచిది కాదని తెలివి గల వారందరికీ తెలిసిన విషయమే. తెలిసిన విషయాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రభుత్వంలో ఇంత వెనుకులాట యెందుకు జరుగుతూ ఉన్నదో మనకు ఇంచుమించుగ బోధ పడినది. విద్య, తక్కువ సమయంలో ఎక్కువగా లభించాలి. అందరికి అందుబాటులోను కూడా ఉండాలి, విత్తానికీ విద్యకూ ముడి పెట్టకూడదు. మానసిక స్వస్థతకు, సంస్కార మునకు మాత్రమే సంబంధ మెుంచాలి. స్వరాజ్యం రానంతవరకు ఈ విషయం సాధ్యం కాదన్నారు కొంతమంది నాయకులు. అది వచ్చిన తరువాతనే ఒక కలం పోటుతో కార్యాన్ని సాధించి వేస్తామన్నారు.

స్వరాజ్యం వచ్చినది. పెత్తనం పైన వేసుకున్నారు. ఇక విద్య, విధానము బాగుపడనున్నదని అమాయక ప్రజలు ఆశించారు. కాని అప్పటి నుండి ఇప్పటివరకూ ప్రజా ప్రతినిధులు పెత్తనం మాత్రం దక్కించుకుంటూ మాట దక్కించుకోలేక పోతున్నారు. కారణం, పాశ్చాత్యుల పరిపాలనలో మన ప్రభుత్వ యంత్రం ఒక పెనుభూతం వలె తయారై పోయినది. ప్రజా ప్రతినిధుల ప్రయత్నాలు అందులో నలిగి పిప్పియై పోతున్నవి. వారే విధిలేక ఆ యంత్రానికి భాగములుగనో, సీలలుగనో మారిపోతున్నారు. పిల్లికి గంట కట్టడానికి సాహసించలేని ఎలుకల వలె ప్రతివిధులు, వృద్ధ వ్యాఘ్రం వలె ప్రభుత్వం రూపొందుట జరిగినది.

మన ప్రాచీన భారతీయ సంస్కృతిని పునరుద్ధరించి పెంపొందించ వలెనంటె విద్యావేత్తలు ఒక అడుగు ముందుకు వేసి విషయాన్ని చక్కగ అధ్యయనం చేయాలి. తమకు తెలిసినంతవరకు అమలులో పెట్టించడానికి నడుం కట్టాలి. ఈర్ష్యా ద్వేషాలకు, జాతి మత భేదాలకు, భాషా విభేదాలకు తమ హృదయాలలో స్థానంలేకుండ చేయాలి సంస్కారం లేని చదువు వ్యర్థం. చదువు ఒక కత్తి వంటిది. సంస్కారమున్నవాడే దానిని సదుపయోగంలోనికి తెచ్చి సంఘాన్ని ఉద్ధరించగలడు. అది లేనివాడు దురుపయోగంలో తననూ. సంఘాన్ని కూడ నాశనం చేసివేయగలడనే నిర్ణయానికి రావాలి.

ప్రజలు, ప్రజా ప్రతినిధులు, విద్యా శాఖాధికారులు తెలివిగల వారమనిపించుకొనుటలోనే తృప్తినొందక మానసిక స్వస్థతను పొంది ఋషుల వలె సంయమీంద్రులుగ త్యాగశీలురుగ పవిత్ర జీవితంలో సాధనం చేసి మానవ ధర్మాన్ని సంస్కృతిని ప్రబోధించే విద్యను, విధానమును మాతృభాషలలో అమలులో బెట్టించి ప్రస్తుత ప్రభుత్వాన్ని కామధేనువుగ రూపొందించగలరని ఆశిస్తున్నాము.

ఎడిటర్

కవిత:

# శార్వరి స్వాగతము

—శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి.

తూర్పు తెలవారు చుండ నేడో వినూత్న
జీవకళ దోచు నీ భూతసృష్టిలోన
పోయె కాబోలును వికారి హాయనంబు
వచ్చె కాబోలు శార్వరి వత్సరంబు.

సృష్టిలో మంచి సోకని చెడుగు లేదు.
చెడుగెదో కొంతలేని మంచియును లేదు.
కాని యెప్పటి కప్పుడు మానవుండు
సంతత భవిష్య దాశాభి సరణ జీవి.

కాల పయోధి వీచికలకైవడి నొక్కటి వెంట నొక్క టు
ద్వేలముగా శరత్తు లరుదెంచుచు పోవుచు నుండు నైన ఆ
శాలతికల్ చిగుర్ప సరసమ్ము లెదిల్ వికసింప జీవలో
కాళి యుగాది యన్న నుబలాట పడున్ సరిక్రొత్త వింతగన్.

పోయిన యేటిమాట తలపోయక యర్వది యేండ్ల కొక్క ప
ర్యాయము వచ్చిపోయెడు ప్రియాతిథి వంచును క్షేమలాభముల్
సేయుమి వంచు స్వాగతము చెప్పెద మిప్పుడు సుస్వతంత్ర జా
తీయ భవిష్యదభ్యుదయ దేవతకుంబలె నీకు శార్వరీ.

శ్రీ గిరిభ్రమరాంబికా గురు ధమ్మిల్ల మల్లికా మంజరీ మధుర సురభి
తిరుపతి వెంకటేశ్వర ఫాలతల యక్షకర్దమపుండ్ర సౌగంధలహరి
భద్రాద్రి శ్రీరామ భద్రబాహాంతరస్థల తులసీదామ సౌరభమ్ము
సింహాచలాగ్ర నృసింహ వక్షోంతర శ్రీఖండ చర్చా పరిమళమ్ము

కలసికొని క్రొత్త వలపులు మొలకలెత్త
గౌతమీ ముఖ జీవన దాత రంగ
శీతలాంధ్రావనీ మధు ప్రాతరనిల
మర్వదేండ్ల మార్గా యాసమపనయించి
శార్వరీ! నీ కొసంగు సుస్వాగతంబు:

పూతనోచినతీవ పొదరింటి పందిట తెలిదమ్మి పుప్పొడి తిన్నెదీర్చి
అలరు దేనియ తేట కలయంపి జివికి లే మొగ్గల ముత్యాల ముగ్గు వెట్టి
పుండ్రేక్షు రసపూరమున పాద్యమర్పించి విరిమల్లె పూదండ ఆయితవైచి
ఎలదేటి రెక్కల తళుకు ధూపమువేసి పవడంపు జివురు నివాళిపట్టి

జీవితము వోలె తీపియు చేదు గలుగు
వేపపూ పచ్చడింత నైవేద్య మొసగి
శార్వరీ ! నీకు ప్రథమ వసంత పూజ
సలుపు చున్నది మా యాంధ్ర జాతి నేడు.

ఆకుల పాటు పాలై స్రుక్కు జీవలోకమునకు నవ వికాసము ఘటించి
పొలమెండి, నోరెండి యలమటించెడు ప్రాణితతులకు నీటి యెద్దడినిమాన్పి
కడుపు చల్లనిమబ్బు కడవలతో ధరాహృదయమ్ములో కృపామృతమునింపి
వలుద లెత్తెడు సరస్వతుల సింగారింప ముదురు వెన్నెల మేలి ముసుగువైచి

పైరు పచ్చలు సుంకులు వారజేసి
యడుగు మడుగుగ తెలిమంచు జడులు కురిసి
కారులారింటలోకోపకారి వగుచు
శార్వరీ ! మా కృతజ్ఞతాంజలులు గొనుము.

భారత సీమంత భాగముల్ చైనా దురాక్రాంతితో చెరలాడు తటిని
భారతమ్ము తృతీయ పంచవర్ష ప్రణాళికను సాధింప పూనుకొను తటిని
పన్నుల బరువు దుర్భరమై ప్రజాశక్తి యంతకంతకు దిగనారు తటిని
అర్థ నగ్నము బుభుక్షాతురమై పేదజీవిత మల్లాడిపోవు తటిని

ఒదవినది నీ శుభాగమనోత్సవమ్ము
శార్వరీ ! నీదు శక్తి వంచనము లేక
చిక్కులం దీర్చి నీ పేరు చెప్పుకొనగ
మంచి గావించి మాట దక్కించు కొనుము.



వ్యాసము :

# ఫ్రెంచి నవలా స్వభావము

—శ్రీ బొడ్డపాటి కుటుంబరాయ శర్మ

నవలలను స్వభావమును బట్టి సాంఘికములనియు, నైతిహాసికములనియు విభజించుట యొక యాచారమై పోయినది. పరికింపఁగా నవల కొక స్వభావమని యుండదు. అది నవలాకారున కుండు ననవచ్చును. నవలాకర్తకే కాదు, ఏ యితర కళాకారునకైన నొక స్వభావమున్న దందుము; అతని సృష్టి యొక తెగకుఁ జెందిన దందుము. అట్టిచో సర్వసాధారణముగ నాతని స్వభావము గాని, యాతని కళాసృష్టిగాని యొక సహజమైన పద్ధతినో, యొక విశేషమునో సూచించునని యే యర్థము. అయినను నా కళాకారుని గుఱించియు, నా కళాఖండమును గుఱించియు విమర్శకులు కేవలము నది యను కొనుటయే యగును. అది యాతఁడు గాని, యాతని సృష్టిగాని తన్నుగూర్చి తాఁ జెప్పుకొనుట కాఁజాలదు. అందుచే బాహిర దృష్టితోఁ జూచు నితరులు వానియందట్లు గుణాధానము సేయుదురేగాని, కళాస్రష్టయుఁ సృష్టియు నిజముగ నేమాత్రము నట్లగుట లేదు. అనఁగా నొక కళాసృజనమును వర్ణనాత్మకముగ వర్గీకరించునపుడు మన మాపద్ధతి నెట్లయిన దానియందుఁ గనుగొనుటకై చేయు ప్రయత్నమే యధికము. అది యథార్థముగ నట్టి వర్గమునకుఁ జెందుట యనునది యల్పము. నవలా స్వభావమునుగూర్చి చర్చించునపుడు గూడ నందు మన యుత్పాదనమే పేరాళముగా వచ్చును. అందుచే మన నిర్ణయములు కడు పరిమితమైన విలువ గలవని మఱవరాదు.

బహుశః సాహిత్య ప్రక్రియల యందన్నిటికంటె నవల నైతిహాసికమనియు, సాంఘికమనియు విభాగించుట సార్వత్రిక మనవచ్చును. అందును నవల కావ్యజాతులలో నెల్ల క్షేత్ర విస్తృతిఁ గలది. అట్టి యీ నవలలజాతినిఁ గంటిలోఁ బెక్కు బింబములు గల విచిత్రమైన క్రిమికీటకాదులతోఁ బోల్పవచ్చును. వాని కొకే దృశ్యము (వస్తువు) పెక్కు దృశ్యములు (వస్తువులు)గా నగపడునట. పిదప నొక్కొక్క నవలాకారు నొక్కొక్క బింబముతోఁ బోల్పవచ్చును. అట్టిచో నొక భాషా ప్రపంచమున కెందఱు నవలా కర్తలో

యన్ని ప్రాపంచక దృశ్యములు నవలల రూపమునఁ బ్రతిబింబించు చున్నవి. వానిని వర్గీకరించునపు డాయా నవలాకారుల చిత్రణములలోఁ గొన్నికొన్ని సదృశములుగఁ గూడ స్ఫురింపవచ్చును. అప్పుడే సాంఘికైతిహాసికాదికము లని నవల లేర్పడు చున్నవి. నిత్యజీవితమునే యితివృత్తముగాఁగల నవలా దృశ్యము, జీవిత దృశ్యమును వలెనే యలవోకగాఁ జూచినంత మాత్రమున బోధపడునది కాదు. ఒక గండుచీమల బారునో, యొక పరిచీమల గుంపునో చూడగఁ జూడగా మన చూపొక చీమపై నిలచును. ఆ యొక్కదాని వ్యాపకమును బట్టి కడమవాని వ్యాపకత్వముగూడ నిర్ణయింపఁ బడఁగలదు. అదియే నవలలవర్గీకరణ విధానముననుఁ గల రహస్యము. కావున సాంఘికము రాజకీయము నన్నపు డొకానొక నవల ప్రధానముగ నట్టిదని స్థూలముగనే యర్థము చేసికొనవలెను.

పాశ్చాత్యదేశముల యందన్నిటికంటె మిక్కిలి వైయక్తిక మగుటయే ఫ్రాంసుదేశవైశిష్ట్యము. సాహిత్యరూపములలోనెల్ల, మిక్కిలి వైయక్తికమగుటయే ఫ్రెంచినవలావైశిష్ట్యము. అందుచేఁ దమ సమకాలిక జీవిత సాగర వాహములును, నందలి యాటుపోటులును నెట్టివో పరిశీలించుటకు ఫ్రెంచివారి నవలాసాహిత్యము మనకుఁ బ్రత్యేకముగఁ దోడ్పడుటయం దాశ్చర్యము లేదు. వినోదార్థము, గాలక్షేపము నిమిత్తము వ్రాయంబడెడి వారి నవలల-యందే తాత్కాలిక జీవిత చిత్రణముండుట ప్రసిద్ధము. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరము ఫ్రాన్సులో బాలశాలా విద్యార్థులకుఁ గూడదని నిషేధింపఁబడిన కథాసాహిత్యమునకుఁ దత్పూర్వ సాహిత్యమునకు సామ్యమేలేదు. ఆ నాఁటి దించుక భఙ్గ్యంతరముగాఁ జెప్పఁబడిన శృంగారమునకుఁ బట్టుకొమ్మ, పిమ్మటి కాలమున వెలువడినది కౌమారమున కర్హమైన సాహిత్యము. ఇంచుక శృంగారస్పర్శ యిందును గలదు. కాని నైతిక దుర్జీవితమునం దేర్పడునట్టి యా తొల్లిటి ప్రలోభన మిందుఁ గానఁబడదు.

ఇది యంతయుఁ బ్రసంగ వశమునఁ జెప్పినను దీనివలన విశదపడు ముఖ్య విషయ మొకటి కలదు. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము ఫ్రెంచి నవలా స్వభావములో నొక మార్పు కలుగుట యిందువలనఁ దెలియును. ఆ యుద్ధానంతర సాహిత్యములో బ్రదర్శింపఁ బడిన యంత ర్ద్వంద్వమూ లతిల్లో వెల్వడిన నవలలకు విశిష్టత నాపాదించెనని చెప్పవచ్చును. కళలో

నొక సమస్య పొడముటయు, దానినిఁ బరిష్కరించుటయు ననునవి పఠితలకుఁ గలిగించు నౌత్సుక్యమెట్టిదో యది మఱల నిటీవలి తరవాతంవలి నవలలలో లేదు. కావున దాని విలువ మఱియు గ్రహింప గల్గుచున్నాము. వెలువడుట కనేక నవలలు నేఁడును వెలువడు చున్నవి. కాని యివి యుద్ధము ముగిసిన వెంటనే వెలువడిన నవలల యంతటి యౌత్సుక్యమునుఁ గొలుపలేకున్నవి. నేఁడు పెక్కండ్రు నవలా కర్తలు తమ పాత్రల సృష్టిలో నరిషడ్వర్గమునకు, ధర్మమునకు నడుమ నుప్పతిల్లు సంఘర్షముఁ బ్రదర్శింప లేరు. అట్లే ధర్మ శృంగార విజయమునకై స్త్రీ పురుషులు బలిదాన మగుటయు పేరు నెరుపఁ గల్గిన కౌశలము గాదు. సర్వశాస్త్రయగు భగవానుని సామర్థ్యమునందు విశ్వాసము చాలక పోవుటయు, ప్రణయ వ్యాపారముల యం దిదమిత్థ మని నిర్ణయింపఁబడిన ధర్మజ్ఞానము కొఱఁత పడుటయు మున్నగునవి యీ సంఘర్షణను జిత్రింపఁ జాలమికి హేతువులు. "ఫ్లాబర్టు" నవలా కారుఁడు ఫ్రెంచి రచయితలలో విస్పష్టతకును, వైశద్యమునకును బెట్టినది పేరు. అతని ప్రసిద్ధమైన సృష్టి 'ఎమ్మాబొవరే' [1] పాత్రము. అట్టి పాత్ర కూడ సజీవ విశద రేఖలతో తొణికిసలాడుట లేదని యాధునికు లనఁబడు వారు విమర్శింతురు 'ఎమ్మాబొవరే' క్లిష్ట సమస్యా పరిష్కారమునకై యనుభవించిన యంతర్యుద్ధ మంత సహజముగా లేకుండుటయే యీ విశదత్వహీన చిత్రణమునకు హేతువు. [2]

అంత యుదాత్తమైనది గాఁ పోయినను ప్రజామోదము నొందిన కారణముచేత 'ఓనెట్' విరచితమైన 'మైటర్ డిఫోర్జెస్' [3] అను నవల యీ శతాబ్దిలో మూఁడు నాల్గు పదుల నడుమఁ బ్రసిద్ధి నొందినది. అతి యైన నానాఁడు తమ సంఘ మందుండి యున్న వర్గ విభేదముల గూర్చి తానిచ్చు వాఙ్మూలముగ మాత్రమే నేఁడు శాశ్వతత్వము గడించెను. అది

1 'Emma Bovary' is the classic figure of 'Flaubert'.

2 "The anecdote is told of a young woman lately reading 'Madame Bovary' and complaining to a friend that although it was tre's beau, she could not understand what all the fuss was about". ['TENDENCIES OF THE MODERN NOVEL', Pp. 33, 34. George Allen and Unwin LTD, London, Second-impression' (1936)

3 Ohnet's "MAITRE DE FORGES"

యదృష్ట వశముననో, దురదృష్ట వశముననో గాని తొల్లిటి యా వర్గ భేద ములను; వానికి సంబంధించిన విశ్వాసములును నిప్పుడంతరించు చున్నవి. సంఘర్షణం జిత్రింపలేక పోవుటవలన సాహిత్య గౌరవ పీఠమునుండి నవల కిట్టి క్రమ చ్యుతి కల్గుట కేవల మీ శతాబ్దిలో మూఁడు నాల్గు దశాబ్దుల యందు ఫ్రాన్సు దేశముననేఁ గాననగుచున్న దనలేము. అది సార్వ త్రికము. పోనీ మహోదార మైన తొల్లిటి శ్రవ్యదృశ్య కావ్యము లందుమా, యవి నేఁడుద్భవింపఁ జాలవు.[1] కాని యీ చ్యుతి మాత్ర మాపదుల లోని ఫ్రెంచి నవలా సాహిత్యమునందు విస్పష్టమై గోచరించు చున్నది. సాధారణముగ రూపురేఖల తళుకుకుఁ బ్రతిబింబమగు ఫ్రెంచి సాహిత్య సర్వస్వమునందు క్రమ క్రమముగఁ గళా హృదయము కుష్కించుటతోఁ బాటు కుడి యెడముగ నీ నవలా రూపము నందును నీరసస్థితి యావహిల్లె నన వచ్చును.

ఫ్రాన్కో యీ మారిక్[2] రచించిన నవలలలో మాత్ర మంతర్ద్వంద్వ చిత్రణము శోషఁ జెందలేదు. అది ప్రాచి పద్ధతిగనే ప్రవహించు చుండును. అతఁడు పలికినట్లు ధర్మా ధర్మముల నడుమ గాని నీత్యవి నీతుల నడుమ గాని సాగునట్టి యీ సంఘర్షను జిత్రించు విషయమునం దనేకు లశ్రద్ధఁ జూపు టయే గాక తమ తమ రచనలలో నిరసించు ఘట్టములను స్వీకరించుటయు జరిగినది. పాల్ మొరాన్డ్ తొల్లిటి రచన మిందుల కుదాహరింపఁ దగును. దీనిలో రక రకములైన స్త్రీ పురుషులు పాల్గొందురు. వారిలో మార్పుండదు. వారెన్నో జాతులకు నెన్నో యంతరములకుఁ జెందిన వారుగ నుందురు. అందొకరి నొక రన్వేషించుట, యొకరి నొకరు పరిగ్రహించుట, యొకరి నొకరు విసర్జించుట, విశృంఖలులై నిమేష రక్తులై జానిపలైన దానికి వేయిరెట్లుగ నిర్వీర్యులగుటయు నగపడును. ఇందలి పాత్రలన్నిటికినిఁ దెలిసిన ప్రధాన విషయమధమమైన యింద్రియ తర్పణ మొక్కటి మాత్రమే! ఈ యీ పాత్రల చిత్రణ మందుఁ బ్రదర్శింపఁబడిన నిర్ణయము దుర్ధమమునగు ప్రజ్ఞ, ప్రపంచ ప్రథమ సంగ్రామానంతర కాల (క్రీ॥ శ॥

1 Neither 'TESS OF THE D' URBERVILLES', nor the dramas of Hall caine could be written in the nineteen-thirties.

2 Francois Mauriac.

1918 పిమ్మట) పరిస్థితులను గూర్చియు, యుద్ధానర్థములను గూర్చియు 'పాల్ మొరాన్డ్' చేసినట్టి క్రూర విమర్శయై యున్నది.

కాని యీ విమర్శ తత్త్వతః నిస్సారమై విసుగు గొల్పుచున్నది. దీనికి హేతువు లేక పోలేదు. నీతికి నవనీతికిని, ధర్మము కామమునకును గల్గు సంఘర్షను జిత్త సంస్కారము గల మన పూర్వులు నాఁడు చర్విత చర్వణముగఁ జెప్పియు, నుత్కంఠఁ గల్గించినట్లు పరిష్కృతమైన సంఘము నేఁడు సాగించు జుగుప్సాకరమైన జీవితమును బౌనః పున్యమున వర్ణించియు నుత్కంఠఁ గల్గింపలేము.

మార్సెల్ ప్రౌస్ట్[1] మహోదయుని సంతు సారస్వతేయముగ నిస్సంతై పోయినది. అసదృశమైన వ్యక్తిత్వమును జీవిత విధానమునుగల యీతని యసదృశమైన కళాసృష్టి ననుకరింప నోగు లెవ్వరును యత్నింపరైరి. ఈతని బృహత్తరమగు నవల[2] నూత్న యుగారంభ సూచకమైనదికాక తత్త్వముచే విశ్లేషణాత్మకము లగునట్టి గతశతాబ్ది నవలలకు మకుటాయమానమై యున్నను, దాని యందలి నిశితపరిశీలమును జీవిత చిత్రణమునుఁ దరువాతి తరముపై గూడ ప్రగాఢమగు ప్రభావమును నెఱపఁ గలవై యున్నవి. ఇరువదియవ శతాబ్ది పూర్వార్థమున కనుకూలమైన కొన్ని యాలోచనా మార్గములను గొన్ని దృష్టి మార్గములను 'ప్రౌస్ట్' సృష్టింపక పోయినను సమీకరించి పెట్టినాఁడు. జీవితమునకు సంబంధించిన యొక దర్శనపథముచేఁ బఠితలకొక విశిష్ట జీవిత పథమును జూపి చెప్పఁగల నవలా

1 The first Novel of Proust was 'GEAN SANTEVIL', a tale of youthful disillusionment. According to George D 'Painter' Proust's many-Volumed novel, ' A LA VECHERCHE DU TEMPS PERDU' is the epitome of the close of the nineteenth century. But it is not so much a novel as a creative autobiography, a symbolic story of his own life with its situation and characters transmuted by his imagination into a universal allegory of Man's condition. [See, 'MARCEL PROUST : A BIOGRAPHY " by George D Painter, Chatto & Windus, London. (30 sh.) Also see, a review, on this "Painter's work' under the caption 'LIFE OF PROUST'. (The Hindu Weekly Magazine, Sunday, November 29, 1959, pp. III, Column I.)

2 'A LA RECHERCHE DU TEMPS PERDU'.

కర్తలలో నీవఁ డొకఁడు. ఆంద్రేగైడ్[1] ఇట్టివారిలో నింకొకఁడు. ఇంగ్లాండులోఁ గొంతవరకు డి. హెచ్. లారెన్స్ గూడ నిట్టి వాఁడే. ప్రౌస్ట్ సాహిత్యము నాలోడించిన పాఠకుఁడు, నిత్య నైమిత్తిక జీవితమునందను క్షణము నేదోయొక పరిష్కృతమైన యంతరార్థమును గ్రహింపఁ గల్గుచునే యుండును. గుప్తములు సజీవములునునైన స్త్రీపురుషుల శక్తుల యందలి యాథార్థ్యమునే యాతఁడు పరిశీలించెను. కాని వారి వారి క్లిష్ట దశలకును విపరీతానుభూతులకును, ననివార్యక్లిష్ట నిర్ణయములకును జెందిన పరిస్థితుల యందలి యాథార్థ్యమును గాదు. నైతిక దృష్టికిఁ బ్రాధాన్య మీయని యీ యంతశ్శక్తి పరిశీలనము ప్రౌస్ట్‌నకు విశిష్టమైన యొకానొక విధానము. ఇరువదియవ శతాబ్ది యందలి రెండవపడిలో నీ పద్ధతి ప్రత్యేకత నొందినది. లోకజ్ఞానము, ధర్మనీతి నిరపేక్ష్యమనెడి పక్షమునకుఁ జెందిన నవలాకారుల కావర్శప్రాయుఁడు గాక పోవచ్చును గాని, ప్రౌస్ట్‌వారిలో సిద్ధహస్తుఁ డనుట మాత్రము నిస్సందేహము.

ఇరువదియవ శతాబ్దికిఁ జెందిన రెండుమూఁడుపదుల యందు ఫ్రాన్సుదేశ నవలా సాహిత్యములో నస్పష్టమయ్యు నొక గభీరమైన యశాంతి సర్వవ్యాప్తమై యున్నది. బాహిర దృష్టికి విస్పష్టముగ నగపడు చున్నను ప్రౌస్ట్ ఏర్పఱచిన విధాన మీ యశాంతి తత్త్వముతోఁ గొంత కొంత సంబంధముఁ గలదనవచ్చును. అది భోగముగా భావింపఁబడిన యొక మనో వ్యాధి. యుద్ధకాలమున వృద్ధిభూతమైన కాల్పనికత్వముతోను, 'విల్సన్' చూపిన యాదర్శకత్వము తోడను, నీ మనో వ్యాధికిఁగల సంబంధమును నిరూపించుట సులభము.

దాదావాదులలో[2] నిది మఱింత తీవ్ర రూపముఁ దాల్చినది. సంఘ నిర్మాణము, వాచ్యార్థము, బుద్ధి విశేషము, వాఙ్మయము, మున్నగు వానిని గూర్చి పారంపర్యముగ నంగీకరింపఁబడు సంగతులను వీరు నిరాకరించుట, పైకిఁ జిలిపి దనముగఁ దోచినను నిజమునకుఁ జాల ప్రత్యేకార్థ సూచన గలది. అప్రయత్నకృతమైన భావావేశమునకు బట్టము గట్టుట వలనను, యాథార్థ్యమును తార్కిక (బుద్ధి) ధిషణను నిరాకరించుటవలనను వీరు నిరాశోప హతి నుండి తప్పించుకొని బయట పడఁగల్గుచున్నారు. సాహసకార్య చిత్రణ

---

1 "Andre' Gide".

2 Dadaistes.

ముగల నవలల వలన నింకొక తెలుఁగకు నూఱటచేఁ జిత్తములు చిగురింపఁ గలవు. ఈ జాతి నవలా కర్తలలో 'పెట్టీమాక్ ఓర్లఁ'[1] ప్రధానుఁడు. తమ ఫ్రెంచి జాతి తత్త్వమునకు విరుద్ధమైన భయంకర సాహస కార్యములను జిత్రించుట వలనను, తీవ్ర భావనా జగత్తుల సృష్టించుట వలనను గూడ నీతెలుఁగునకు జెందిన నవలాకారులొక విధమగు సమాశ్వాసమును సాధింపఁ గల్గుచున్నారు. విభిన్నాశయములు గల రచయితలు తమ భిన్న భిన్నమైన నవలలఁ జేసిన సృష్టియందీ సాంత్వనమును సాధించిన విధానములో మాత్రము సామ్యముఁ జూపిరి.[2] వీరి పాత్రలు తాత్కాలిక జీవయాత్రకుఁ జాలని వ్యర్థులు. వారికి యదార్థ జీవితముకంటె వాంఛా కల్పిత జీవితమే యెక్కువ సత్యసన్నిహితము, ఊహామయమును, భావనా పరికల్పితమునగు జగమే విహారసీమ.

ఇఁకఁ గొందఱ నవలా కర్తలను వ్యక్తిగతముగఁ బరిశీలింతము :—

ఇందుకుఁ గొందఱినిఁ బ్రత్యేక పఱచుట సులభ సాధ్యము కాదు. కొందఱినిఁ గుఱించి పూర్వము ప్రసంగింపనే ప్రసంగిచ్చితిమి. ఇంకను బెక్కండ్ర ప్రసిద్ధరచనలీ శతాబ్దిలో నాకర్షణీయములై తుది రెండు మూఁడు శతాబ్దుల జ్ఞాపకశక్తిపైనను జెఱగని ముద్రవేసియే యున్నది. గిడ్[3] జేఁ (జీఁ) గిరాడ్‌డో[4] లిర్వురును బ్రసిద్ధులు. పెట్టీహామ్ప్[5] పారిశ్రామిక జీవిత చిత్రణమునఁ బ్రఖ్యాతుఁడు, వలేరీలార్‌బ (భొ)డ్[6] విచిత్ర పరిశీలనలో నందెవేసిన చేయి. డ్రూ (య్) లారోకె (షె) ల్ (ల్లె)[7].

1 "Pierre Mac Orlan" was the chief of the "Adventure" novelists.

2 Pierre Mac Orlen was followed by Montherlant, by Cocteau, by Morand, by Soupault, by Crevel and even by Duhamel.

3 Gide's novels are 'LES FAUX MONNAYEURS' and 'SI LE GRAIN NE MEURT'.

4 Jean Girandoux's novels are, 'SIEGFRIED ET LE LIMONSIN'; "SIMON LE PATHETIQUE"; 'BELLA'; and "ADORABLE CLIO".

5 Pierre Hamp.

6 Valery Larbaud's novel is 'MONOLOGUE INTERIEUR'

7 **Drieu la Rochelle.**

విశ్వవిద్యాలయ విద్యార్థిదశ యందు యుద్ధములో దుమికిన యే తరమువారు గాని తమ రచనల యందుఁ జూపు ప్రత్యేకత చూపెను. జెఁ (జీఁ) గి (యా) నో[1] చిత్రణములు మిక్కిలి సరళములై కళా సమన్వితములు గానట్లుండును. కాని స్థానిక జానపదుల ప్రాకృతన జీవితమును వర్ణించుటలో నతఁడు తనుఁ దానె పోలఁగలఁడు. ఆన్డ్రీ మారిస్[2] చిన్ననాఁటి రచనలు సగమాట కొనితనమును వెల్లడించినను[3] నవలా కర్తగా బరిణత ప్రజ్ఞుఁడై ప్రగతిఁ జూపుట ప్రసిద్ధము[4] లియఁ డౌడెట్[5] యీ శతాబ్ది నాల్గవ పడికిఁ జాల వృద్ధుడయ్యు ఖ్యాతిఁగొన్న పత్రికా సంపాదకుఁడు. నేఁటికిని జవశక్తులచే స్పందించుచున్న యాతని నవలలు వ్రాసెను. యాంద్రీ మాల్‌రా[6] చిత్రించిన చైనాదేశ విప్లవ పరిస్థితులు విపులములేగాక విశదములు గూడనై యనన్య సదృశము లనిపించుకొన్నవి. ప్రాచ్యదేశ సమకాలిక పరిస్థితులయందు గోచరించు విపర్యాసములోని గంభీరభావమును పాశ్చాత్య దేశములకు నిపుణముగ సూచింపగల్గుట యీతని రచనల[7] లోని విశిష్టత. యుజేఁ డాబిట్[8] రచించిన 'హోటల్ డునార్డ్' అను నవల వీధిలోనున్న భోజన శాలను గూర్చి వ్రాసినది. ఇటీవలి కొన్ని యేండ్లకుఁ బూర్వ మీ నవల భిన్నశాఖలవారి వాదోపవాదములకు గుఱియైనది. మౌరియక్[9] సర్వమత సమ్మతిఁగల 'కేథలిక్స్'లో ప్రధానభూతుఁడైన నవలా కారుఁడు. ధర్మకామముల

1 Jean Giono.

2 Andre Mauris.

3 "BRAMBLE and O' GRADY BOOKS".

4 Andre Maurois's equisitely finished novels are 'CLIMATS' and 'CERCLE DE FAMILLE'.

5 Leon Daudet.

6 Andre Malraux.

7 Andre Malraux's novels, notably dealing with Pictures of revolutionary China are, 'LES CONQUERANTS' and 'LA CONDITION HUMAINE'.

8 Eugine Dabit's novel, 'HOTEL DU NORD' was the rallying Point of the so called "Populiste' school a fewe years ago. (See, 'Tendencies of the Modern Novel', pp.. 39)

9 Mauriac.

నడుమ జరుగు సంఘర్షను విశదముగఁ జూపగల్గుట యీతని విశిష్టత, ఆవైశద్య మపాయకర మైనంతటిదని కూడ నీతని విరోధులు విమర్శింతురు. జార్జెస్ బెర్నానస్ కూడ నిట్టివాఁడే. ఆత్మక్షోభమును, ధర్మగ్లానిని గూర్చి యితఁడు సుదీర్ఘముగ వ్రాయును. కాని యీతని యొకానొక నవల[1] యందొక ప్రత్యేకత గోచరించును. అందితఁడు సృష్టించిన యొక ప్రవక్త కడు నాధునికుఁడు. ఎంత యుత్సాలుఁడో యతఁడంత భావావేగి.

ఈ పట్టిక నిట్లు పొడుగించుచు రావచ్చును. కాని యిర్వురి రచనల నిశిత పరిశీలన మిచట ముఖ్యము. తన ప్రథమ నవల వెలువడు వఱకు నింకొకనిని నవలాకర్తయనియే లోకమెఱుఁగదు. రెండవ యాతఁడు పేరొందిన యాటకకర్త; పాతిక యేండ్ల సాహిత్య కృషి చేసిన పండితుఁడు. ఈ యిర్వురును దమకాలమును, దాని తత్త్వమును బాగుగ గుర్తించినవారు. వీరిలో లుయియి ఫెర్డినాన్డ్ సిలైన్[2] ప్రథముఁడు, జూల్ (ల్స్) రోమెయిన్ (న్స్)[3] ద్వితీయుఁడు.

సిలైన్ ప్రథమ నవల[4]లోని యితివృత్తము, యుద్ధసమయ పరిస్థితులలోఁ జిక్కిన యొక యువకుని జీవితయాత్ర. ఈ రచనతో నితనికి సారస్వతమున నొక స్థానము లభించినది. ఈ నవల యొకానొక తెగకుఁ జెందినదని చెప్పుటకు వీలుకానిది. ఇది రెండువందల యేబది యాహ్పృష్టులకుఁ బైగా ముద్రింపఁ బడుట యెవ్వరి కద్భుతావహము గాకుండును? దీని కర్తను గూర్చి యిసుమంతయు లోకమెఱుఁగదు. అతఁడు పారిస్ నగర సమీప మందలి యొక జనపదములో వైద్యుఁడట. ఇతనికి సాహిత్య రంగముతోడి పరిచితియే యల్పము. ఇంగ్లాండు నందుకంటె నధికముగ ఫ్రాన్స్‌నందు రచయితలు సహకార ప్రచురణ సంఘముల నెలకొల్పుకొనుట పరిపాటి. సిలైన్ తొలుదొలుతఁ దన బృహద్గ్రంథముఁ బ్రచురణకర్త కొసఁగుచు దానితోఁ బాటు ప్రచుర ణార్థము రొక్కముఁ గూడ నీయఁ బోయినంతటి యాచార పరిచయ

1 This novel of George's Bernanos's is "LE SOLEIL DE SATAN".

2 Louis Ferdinand Celine.

3 Jules Romains.

4 "VOYAGE AN BOUT DE LA MEIT" Published in English by Chatto & Windus.

విహీనుఁడు. యుద్ధాత్పూర్వమేర్పడు ననిర్వచనీయమగు విప్లవ పరిస్థితులను సీఫై్ౖన తీవ్రత తోడను, నిర్నిరుద్ధావేశము తోడను సంగ్రహపఱచెననియు, యుద్ధానంతర మేజాతిగాని పొందు భావస్థితిగతులను, ననుభవములను గూడ నీతఁడసదృశముగఁ జిత్రింపగలఁడనియు మనమొక్క మాటలో సులభముగఁ జెప్పివేయఁ బ్రయత్నింప వచ్చును.

కాని యీతని నవలను వర్ణించుట యెంత దుస్సాధమో దాని స్వభావమును బరిశీలించుటయు నంత దుస్సాధమే! ఫ్రెంచి వారిలో నధిక సంఖ్యాకులకు, విదేశీయులలో నధిక తరులకును నిందలి భాషయు, శయ్యయు దుర్గ్రాహ్యముగ నుండును. కాఠిన్యమునకుఁ దోడు శయ్య యపరిష్కృతము, నసుందరమునై యున్నది. అది సందర్భ సమన్వయ శుద్ధి రహితము, సమతాగుణ శూన్యమునై యున్నది. గ్రంథ మందమా! చాలా బృహత్తరము.

అయ్యు నిందొక రహస్యము గలదు. పఠిత నిది పఠనవ్యగ్రునిఁ జేయుటలో సాటిలేనిది. భావనాపరునిఁ జేయుటలో గూడ దీనికిఁ గల సామర్థ్య మనన్య సాధారణము. దీనిని సార్వకాలిక గ్రంథమని మాత్ర మప్పుడే త్వరపడి చెప్పరాదు. సమకాలిక భావస్థితులయు, ననుభవములయు చిత్రణమే చాల వఱకీ నవల కాలంబనము. ఉత్కృష్ట కథాసాహిత్య విలక్షణ మనఁదగు సార్వకాలికత యిందెంతవఱకు కొఱవడునేమో యనిపించును.

"బార్డము"[1] అను యువక నాయకుఁడు యుద్ధమునకుఁ బూర్వ పరములందుఁ బొందిన యనుభవముల కీ నవలలోని కథ కేంద్రస్థితి గన్నది. కథలో ముందింపించుకగ సూచింపఁ బడిన పరిస్థితులు, క్రమ క్రమముగ నాయకుని మృత్యు దంష్ట్రా ఘరట్ట కర్మమునఁ బడఁ ద్రోసినట్టుఁ బడ ద్రోయును అంతటితో నవి ముగియవు; అతని తరువాతి తరము వారినిఁ గూడ లోఁగొనును. అతఁడు యుద్ధ యంత్రాంగములోఁ జిక్కుకొనఁగా మిక్కిలి విషాదకరములగు తాత్కాలిక జలావాహము (Currents of the Time) లాతని నిటునటు నెట్టును. జుగుప్సాకరములగు ప్రదేశములలో నాతని సంచారమును వ్యక్తిగతాను భవమనుట కంటెఁ బతయాళువైన (Disintegrating) నాగరకతకు సంకేతమనుట లగ్గు. ఫ్లాండర్స్‌నందలి

[1] 'Bardamu', is the hero of the novel, 'VOYAGE AN BOUT DE LA NUIT' of Louis Ferdinand Celine.

దుష్కృత్పరిసరముల నుండి తప్పించుకొని యాతఁడొక యున్మాద చికిత్సా లయము( జొచ్చును. ప్రశాంతమగు పారిస్ నగరము వీడి యాఫ్రికాదేశ మధ్యము( జేరును. ఆ యాఫ్రికానుండి ఫోర్డ్ వంటి శ్రీమంతులకు నిలయమైన యమెరికాలోనికి దూఁకును. అందాతఁడు బానిసగాఁ బడిన పాట్లన్నియు నత్యంత భౌతిక రాజ్యముగ జగత్ప్రఖ్యాతిఁ గన్న యమెరికా దేశముపై నాఁడు పసిరిన యవహేళన కశాఘాతములే! పిమ్మట నితఁడు ఫ్రాంస్‌నకుఁ దిరిగివచ్చి నిష్ప్రయోజకుఁడగు వైద్యుఁడయ్యెను. పారిస్‌నకు సివారైన యొక పరమ కుగ్రామములో వైద్యవృత్తి నవలంబింప నిశ్చ యించుకొని యందొక నేరములో భాగస్వామ్యమును సంపాదించుకొనిన యభాగ్యుఁడతఁడు. పిదప "బార్దము"నకు 'రాబిన్‌సన్' తోఁగల మైత్రినిఁ గూర్చి యీతని నవల విస్తరించును. ఇందిట్టి కొన్ని ఘట్టములలో నీ నవల విశ్వజనీనతను గోల్పోయినను, నాటకీయతను ఘనముగ సాధించినది. పిమ్మట రాబిన్‌సన్ మరణమను నాకస్మిక పరిణామ మిందు మహో దారముగ నిర్వహింపఁ బడెను. దూషితము దుఃఖావహము, నతి చంచలము నగు నాఁటి నాగరికత నీ నవల శల్యపరీక్ష చేయుటలో ననన్య సామ్యమై రేగినది.

ప్రసిద్ధు లిర్వురిలో రెండవ వాఁడగు జూల్ (ల్స్) రోమెయిన్ (న్స్) రచనానుభవముఁగల వాఁడని మున్నే చెప్పఁబడినది. తానేమి రచించు చున్నదియుఁ జాల స్పష్టముగ నతఁడెఱుఁగఁ గలఁడు. తొలుదొలుత నాటక కర్తయైన యీతఁడు క్రమముగ నవలా కర్తగ మారెను. ఈ పరిణామము బుద్ధిపూర్వక మగుటచేఁ గ్రమబద్ధము, శాస్త్రీయము, నిర్దుష్టమునై యున్నది. అనేక సంపుటములుగా వెలువడిన యీతని పెద్ద నవలకు[1] 'పారిస్' మహా నగరము కార్యరంగము. ఇందు, నాయకుని సాధనగాఁ జేసికొని నవలాకర్త తన ప్రధానోద్దేశమును నిర్వహించు కొనును.

క్రీ॥ శ॥ 1918, అక్టోబరు ఆఱవ తేదీ యుదయమును, నడి బొడ్డుగా గ్రహించి పారిస్ నగరములోని సజీవ మాంసరాశి నీతఁడొక నడిమి కోఁత కోయును.

1. Les Howmes de Bonne Volonte'. Several Volumes of this novel have appeared in English (Translated as 'MEN OF GOOD WILL', By warre B. Wells.) [Lovat Dickson.]

తర తమ భేదముఁ గల బహు విధములకు స్త్రీ పురుషు లీ నవల యందలి పుటలలో సంచారము చేయుచుందురు. వారి వారి మార్గము లొక శృంగాటకము నొద్దఁ గలియును; మఱల విడిపోవును. అందొక బాట యింకొక దానిని ఖండించును. అవి సంకీర్ణములైనను విభిన్నములైనను వాని యందొక క్రమమున్నది. ఆ క్రమత క్లిష్ట భూయిష్ఠమ య్యును సుందరము. రోమెయిన్ (న్స్), ఒక్కొక్క దృశ్యములో బహు ముఖములైన మానవ వ్యాపకములు బహు దిశల వ్యాకీర్ణము లగుటఁ బ్రదర్శింపఁ గలడు. ఈ వ్యాకీర్ణతకు, స్వార్థము, భావావేశమువంటి శక్తులే గాక దోషాచరణము నున్మాదము మున్నగునవి కూడఁ గారణము లగుట యీ ప్రదర్శనమున గోచరింపఁ గలవు. ఒక్కొక్కపుడీ భిన్న భిన్న శక్తులు పరస్పరము రూపు మాపు కొన్నట్లగ పడుటయో ముడుగునఁ బడిపోయి నట్లుండుటయో కూడ కాన నగును. బహు విధ విషయ సంకులమైన యీ జీవితమునందుఁ గూడ నతఁడొక పరిపూర్ణతను నిరూపింపఁ గలఁడు. త్రెంపుకొనుట ముడి యిడు కొనుటతోఁ జికిబికియైన ప్రగతినే యీ పరిపూర్ణత యాశించు చున్నదా! యను నట్లుండును. అయిన నా సమ్మర్దనమునందు, నా భావ సంఘర్షమునందుఁ గూడ కొందఱు సన్మార్గులుండుట సహజము. ఈ లక్షణ ములకుఁ దన కళను లక్ష్యముగాఁ దీర్చి దిద్దుటయే యాతని యుద్దేశమని తోఁచుచున్నది. ఈ ధ్యేయము నందాతఁడెంత వఱకు కృత కృత్యుఁడు కాఁగలఁడు? ఎంత వఱకయ్యెను? అనువాని నిదమిత్థముగ నెవరు నిర్ణ యింప గలరు? అది యిప్పటిలోఁ దేలునది కాదు. మొత్తము మీఁదఁ జాల ఘట్టము లత్యద్భుతముగ నౌత్సుక్యాపాదకములై యున్నవి.

ఒక్కమాటలోఁ జెప్పినచో 'సెలైన్' న కొక మహదాశయమున్నది, రోమెయిన్ (న్స్) న కొక మహాశయమున్నది. ఒకరిది సహజావ బోధము వంటిది; రెండవవారిది శాస్త్రీయసృష్టి చోదితము, స్వయంకృషి ఫలితము. ఈ హేతువులచే వీరి యీ నవలలకొక ప్రత్యేకత గలదు. నవలలలో నీత్యవి నీతులకును, ధర్మాధర్మములకును గల్గు సంఘర్షణము, చెట్టునకుఁ జేవవంటిది. పై రెండు నవలలలోఁ జొఁఅని యీ చేవకు, చొచ్చిన యీ మహదాశయ మహాశయములు ప్రత్యామ్నాయములై యాధునిక రచనలనుఁ బెక్కింటినిఁ ద్రోసి రాజనుచున్నవి.

# ★ మధు మధురిమ ★

— శ్రీ ఆలమూరి వెంకటాచలము

విరిసిన మావి లేమొలక వీసరవోని మెఱుంగు ముల్కిగాఁ,
బురిగొని మ్రోయుఁదేటి పదుపుల్ నిడుపారినయల్లె త్రాడుగాఁ,
బరువపుదెందముల్ గురికిఁ బాల్పడఁ జేయుచు వచ్చెఁ గంటివే
చౌరవగలట్టి యిమ్మరుని చుట్టము నామని జోదు నుగ్మలీ!

భూరుహముల్ సపుష్పములు; పుంఖిత పుష్కరముల్ తటాకముల్;
మారుత ముల్లసత్సురభిమంతము; రామలు రాగరంజితల్;
సారసుఖాస్పదంబులు నిశాముఖముల్; దినముల్ సుదీప్తముల్;
హారితరంబులయ్యె నిటులన్నియు, నవ్యమధూదయంబునన్

సారసములకు, వాపికా సలిలములకు,
గౌముదీ వల్లులకు, మత్తకాశినులకు,
మొగ్గదొడిగిన మామిడి మోకలకును,
జక్కమెఱుఁగులు దిద్దె నీ చైత్రలక్ష్మి.

వరమాకంద నవ ప్రవాళ రసమాస్వాదించి, కైపెక్కి, దొం
తరముద్దుల్ కురిపించెఁ బుంస్పికము కాంతా భాసితాస్యంబుపై
నరవిందంబున మించ తుమ్మెదయు రాగాలాపముం జేయుచున్
పరసంబాడెడుఁ బెంటితోడఁ గను మీ చాటు క్రియాదక్షతన్.

తామ్ర ప్రణాళ గుచ్ఛవి
నమ్రములై, తరుణ పవన నర్తిత శాఖా
క్రమ సుమ తుందిలములై,
యామ్రమము, లివి, యలరఁజేయు, నతివల మనముల్.

కలయ, రుచిర ప్రవాళరాగ ప్రసూన
భరితమై, నూత్న కిసలయ బహుళమైన,
యల యశోకము, శోకమయంబుఁ జేయు
హృదయమున పిన్న వయసువారికి లతాంగి!

సులభ మదద్విరేఫ పరిచుంబిత సూనసముచ్చయంబులై,
యలస సటత్సమీర చలితానత కోమల పల్లవంబులై,
యలరు, రసాలసాలకవికావలి, నించుక చూచినంతనే
చెలమల చందమై, యథిక చిత్తము లువ్విళులూఱకుండునే ?

కామినీ కాంత ముఖ కాంతిధామమైన,
కురవకద్రుమ మంజరీ పరమశోభఁ,
గనిన, సహృదయుఁడైన యెవ్వని యెడం ద
స్మరశిలీముఖ పతనార్తిఁ బొరయకుండు ?

మూగనోముఁ దొఱంగి ముమ్మరంబుగఁ గూయు
గండుగోయిలల కాకలిరవంబు,
విరుల యోవరుల, వేమరు, గానసభఁజేయుఁ
జంచరీకముల నిస్వనము సొంపు,

గాలిఁ దూగుఁ గఠోరగర్భ గుర్విణులైన
బహువార సహకార పాదపములు,
చిరునవ్వు వెన్నెల విరజిమ్ము మల్లెలఁ
దళుకొత్తు మంజులోద్యాన తటులు

వినయ శాలీనవతులయ్యు విషయరక్తిఁ
జొరవఁ గలిగించుఁ గులగృహ స్నుషలకైనఁ,
దలిరు పయసున రాగ పంకిలములైన
చిత్తముల నాచికొనుటింకఁ జెప్పనేల ?

బాలామ్రీ సుమనోగుళుచ్ఛ శరుఁడై, పాలాశ కోదండుఁడై,
రోలంబోచ్చయ శింజినీ లతికుఁడై, లోకత్రయీజేతయై,
ప్రాలేయాంశుసితాత పత్రము, నభస్వద్దంతియుంగల్గి, చై
త్రాలంబంబున నొప్పు మన్మథుఁడు మీ కందిచ్చు మాంగళ్యముల్.

(ఋతుసంహార శ్లోకముల కాంధ్రీకరణము)



వ్యాసము:

# భారతీయ సాంస్కృతిక సంప్రదాయము
## (దాక్షిణాత్యుల భాగము)

—పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ

అనాదినుండి భారతీయ సంస్కృతిని రూపొందించి, సంరక్షించు బాధ్యత యందు కృతకృత్యులగుటకు అనేక మంది మహానిర్మాతలు బహుముఖ ప్రయత్నములు కొనసాగించిరి. దేశమందు ఏ ప్రాంతమునకు చెందిన వారైనప్పటికీ వారు వారి ప్రజ్ఞను సంపూర్ణముగా వినియోగించిరన్న అతిశయోక్తిగానేరదు. మానవాళియందు నాగరికత ఉద్భవించిన నాటినుండి మానవత్వమును విపులీకరించుటయందు వ్యష్టిగాను, సమష్టిగాను ప్రయత్నములు బహుళముగా కొనసాగినవి. ఇట్టి కృషి మానవ సంఘ శ్రేయోభివృద్ధికై ఒక్కొక్కప్పుడు ఉచ్చారణలోనే నిలచి నేటికిని 'పదముగ' రూపొందినది. రానురాను ఈ "పదము" లిఖిత రూపముగ సంరక్షింపబడి అతి ప్రముఖ పాత్ర వహించినది. ఇట్లు ప్రాచీన, అధునాతన భావములు అనేక రూపములలో చెప్పబడి తర తరములనుండి యిక్కట్లకు లోనై భావి తరముల వారి ఉపయోగార్థమై మరింత ఇంపు సొంపులతో నేటికిని నిలచి యున్నవి. శిల్పము, చిత్రలేఖనము వంటి సంస్కృతి యంగములతో లిఖితముగ నిలచియున్న వాఙ్మయమును పోల్చి మంచి చెడ్డలు నిర్ణయించుట కష్టతరము. కాని, నేటి సంస్కృతికి భౌతిక బింబము పునాదిరాయి అయినచో సారస్వత బింబము పైకి కనిపించు భవన నిర్మాణమని చెప్ప వచ్చును.

ఇట్లు భారతదేశమున సంస్కృతీరంగ పురోభివృద్ధి అతి చైతన్యవంత ముగ ఎడతెగకుండ ప్రబలము గాజొచ్చినది. శిల్ప చిత్రలేఖనములు వాఙ్మ యములు అనేకములైన మార్పులకు గురియైనవి. కాని ఎన్ని యిడుములు వచ్చినప్పటికి భారతీయ ప్రజ్ఞ కాలవాహినిలో కలసి పోక అభివృద్ధి గాంచినది. అదియునుగాక అభివృద్ధికి దూర మెప్పుడును అడ్డంకు కాలేదు. భౌగోళిక సామీప్యత, ఎత్తైన పర్వతములు, ప్రకృతి సౌందర్యము, సుదీర్ఘ సముద్ర తీరము, మైదానములు, పీఠభూములు ఇత్యాదులు భావ పుష్టి, పదపుష్టిగల

గ్రంథ రచనలకు అత్యంతముగ తోడ్పడినవి. వాటిని భారతీయ సంస్కృతి నిర్మాతలు సునిశితముగ వాడుక చేసిరి. ఇట్లు నిర్మింపబడి పెళ్ల సరబడి నిలచి యున్న సంస్కృతి భౌతికముగ ఒక ప్రాంతమునకు గాని, జాతి మతములతో గాని కట్టుబడి యుండ లేదు. అందువలన ఆయా నిర్మాతలు మన కృతజ్ఞతకు పాత్రులని వేరుగ చెప్ప నవసరము లేదు.

రాజకీయ ఉద్యమములకు సంబంధించిన నాయకులు సామ్రాజ్య వ్యాప్తికి దండయాత్రలందు నిమగ్నులై దగ్గర, దూరములను గుర్తు ఉంచు కున్నప్పటికీ సంస్కృతి రంగమునందు కృషి సల్పుచున్న వారు అటువంటి సంకుచిత దృష్టిలేని వారై దూర స్వభావమును ఎప్పుడును లెక్కచేసి యుండలేదు. ఇట్లు సంస్కృతికి ఉపాంగములైన మత, తత్త్వ, శిల్ప కళా రంగములందు ప్రాంతీయ తత్త్వము కానరాదు. దేశమునందు మూల మూలలకు వారి కృషి ఫలితములైన శిల్ప, చిత్రలేఖన, సారస్వతనులను గొనుపోయి విజ్ఞాన వికాసమునకు తోడ్పడిరి. మానవ సంఘములో ఒక స్థానము నాక్రమించుటకుగాను కావలసిన ఆత్మోత్కృష్టత పొందుటకును, మానవాళి ప్రయత్నములు నిరాఘాటముగా సాగుటకును అవసరమైన ప్రజ్ఞా సంపత్తిని వారు కూర్చి పెట్టిరి. ఈ ప్రజ్ఞా సంపత్తియే దేశమునందు అనేక భూప్రాంతములకు చెందియున్న సంస్కృతి నిక్షేపము. భారతీయ సంస్కృతి అభేద్యము. విడి విడిగా పరిశీలించుటకు కూడ శక్యము కానిది. వివిధ భాషా ప్రాంతములలో అనవరతముగ కొనసాగుతున్న ఈ కృషిని ఏక దృష్టితోనే పరిశీలించాలి. అనగా భారతీయ సంస్కృతి సమష్టి కృషి ఫలితమని చెప్పాలి. ఒక్కొక్కప్పుడు ఎవరైన ఒకరిద్దరు ఎక్కువ కృషి గూడ చేసి యుండవచ్చును. సమగ్రముగ పరిశీలించిన భారతీయ సంస్కృతి యందు దక్షిణాది వారి అంశము కీలకమన్న అతిశయోక్తి కానేరదు.

ఇట్లు శతాబ్దులుగ సంరక్షింపబడి బృహద్గ్రంథములుగ తయారైన పదజాలమునే మనము వాఙ్మయ మని పేర్కొనుచున్నాము. ఇది గ్రహింప బడినది, ఇంకను అభివృద్ధి జేయదగినదిన్నీ అయియున్నది. భారతదేశ వాఙ్మయమునకు నాంది జగత్ప్రసిద్ధములైన వేదములని చెప్పవచ్చును. చతుర్వేదములలో ఎన్నికగన్న ఋగ్వేదము ఇప్పటి పంజాబులో జనించెననుటకు ఆధారములున్నవి. ఈ వేదమునకు మొదటి భాష్యము రచించిన ఆపస్తంబుడు దక్షిణ భారతదేశమునకు చెందిన గోదావరీ మండలమున వెలసెనని

చెప్పుదురు. దీనిని బట్టి పరిశీలించిన సంస్కృత భాష ఉత్తర భారతీయుల కెంత సన్నిహితమో దాక్షిణాత్యులకు కూడ నంతే సన్నిహితమని గోచరించుచున్నది. క్రీస్తు పూర్వము చేర- నేటి కేరళ-, పాండ్య- దక్షిణ తమిళనాడు-, చోళ- ఉత్తర తమిళనాడు-, దేశములను పాలించిన రాజులు సంస్కృతమును పోషించి యుండిరనుటకు తగు నిదర్శనము లున్నవి. దక్షిణ భారతము సంస్కృతమును అమితోత్సాహముతో స్వీకరించి, పాండిత్యము పెంపొందింపజేసి ఉన్నత స్థితికి గొంపోయెననుటకు సందేహము లేదు. సాతవాహన, ఇక్ష్వాకు, చోళ, హొయసాల, కాకతీయ, రాష్ట్రకూటుల కాలములందు కూడ ఉన్నత సాహిత్యము వెలువడినది. విజయనగర సామ్రాజ్యమును పాలించిన రాయలనాటి కాలమున వెలువడిన తెలుగు సాహిత్యము అత్యుత్తమ శ్రేణికి చెందినది. ఇట్లే దక్షిణాదని వెలువడిన సంస్కృత వాఙ్మయము కూడ భావ పటిమతోను, రచనా శిల్పముతోను విరాజిల్లినది. తత్త్వశాస్త్రమున అఖండ ఖ్యాతి గాంచిన శంకరాచార్యులు వంటి ఆచార్యులెందరికో దక్షిణ భారతము పుట్టినిల్లయినది. ఆది శంకరులకు జన్మస్థానము ఇప్పటి కేరళ దేశము. దీనినిబట్టి సంస్కృత భాషా పాండిత్యము నరయుటకు గణనీయమైన కృషి సాగినట్లు తెల్లమగును. విశిష్టాద్వైత తత్త్వమును బోధించిన శ్రీమాన్ రామానుజాచార్యులు వారు కూడ సంస్కృత భాషలో ఎన్నికగన్న పండితులు. ఈయనది తమిళనాడు. ఆచార్యులలో తృతీయ స్థానమును గడించుకొన్న మధ్వాచార్యులు కర్ణాటక ప్రాంతమునుండి వెలిసిరి. తరువాతి స్థానము నాక్రమించుకొన్న వల్లభాచార్యుని జన్మభూమి 'ఆంధ్ర.' ఈయన సంస్కృత భాషా రచనలు సాటిలేనివి. ఈ విధముగ దక్షిణ ప్రాంతమునకు జెందిన తమిళ, తెలుగు, కన్నడ, మళయాళము అను భిన్న భాషావర్గముల వారు వారి వారి శక్తిని బట్టి భారతీయ సంస్కృతిని యథేచ్ఛముగా పెంపొందించిరి. ఇప్పటికిని ఈ తత్త్వ చతుష్టయమును భారతీయ సంస్కృతీ రంగమున అగ్రగాములుగా పరిగణింతురు. వారి తత్త్వభావములు పుష్టిగను, వాడిగను, వేడిగను యుండి ఉత్తమ శ్రేణికి చెందినవిగా ఒప్పుచున్నవి.

భౌగోళికముగ దక్షిణ భారతము చుట్టూ జలమయమై ద్వీపకల్పముగ నున్నది. ఉత్తర భారతము హిమాలయ పర్వత శ్రేణులతో

విరాజిల్లుచున్నది. సంవత్సరమున మొదటి ఋతుపవనము దక్షిణమున ప్రారంభమై ఉత్తరముగ పయనించి ఉన్నత పర్వత పంక్తులెక్కగనే గురుత్వాకర్షణ బలముచేతను కాబోలు ఆ వర్షపు నీరంత మరల ఋతుపవన ప్రభవ స్థానము జేరుచున్నది. ఈ సామ్యము సంస్కృతి రంగమున కూడ నొప్పుచున్నది. భావవార్తావహులను ఉత్తరాదివారు దక్షిణమునకు పంపి నప్పుడు వారిని కడు గౌరవాదరములతో స్వీకరించి ఆయా భావములను మరింత పటిష్టము జేసి మరల ఉత్తర దిశకే పంపుచుండెడి వారట. ఇట్టి సాంప్రదాయ నిదర్శనములు భారతీయ చరిత్రయందు అడుగడుగున కాననగును.

భాషా శాస్త్ర కోవిదులు, ఉచ్చారణ వేత్తలు, భాషా ప్రచారకులు దక్షిణ భారతీయ భాషలు ఒక వర్గమునకు జెందక భిన్నములని తలంతురు. ముఖ్యముగ పదజాలమున, నుడికారమున, వాక్య నిర్మాణ విశేషములందు భిన్నత్వమున్నట్లు నిరూపింతురు. అయితే ఇవి శాస్త్రకారులకు సంబంధించినవి మాత్రమే. ఈ సంస్కృతి రంగమున ఇట్టి భిన్నత్వము కానరాదు. పైగా ఏకత్వమే గోచరించును. కాని ఇట్టి భాషా భేదముల సంస్కృతి ప్రగతి కెప్పుడును ముప్పు తేలేదు. పైగా పాళి భాషను బౌద్ధులు, అర్ధమాగధిని జైనులు నిరాఘాటముగా ప్రచార భాషలుగా వాడినప్పుడు గూడ దక్షిణ భాషల నెప్పుడూ వారు పరభాషలుగా నిరసించలేదు. ప్రాచీన తమిళ గ్రంథములైనటువంటియు జైన విరచితమైన "సిలపాదికారం" బౌద్ధులు రచించిన "మణిమేఖల"యు అట్టి సంకుచితాభిప్రాయములకు తావులేకుండ జేయుచున్నవి. ఈ రెంటిని పరిశీలించిన ఉత్తమ సారస్వత శ్రేణికి జెంది నవిగా ప్రఖ్యాతిగాంచినవి. భారతీయ వాఙ్మయమున ఇవి రెండును రెండు మణిపూసలు.

సంస్కృతము, పాళి, అర్ధమాగధి, అను మూడు భాషల వారు చైతన్య పూరితులైన తత్వవేత్తలు, ఋషిపుంగవులు, కళారాధకులు, శిల్పులు దక్షిణ భారతావని యొక్క ఉనికిని పటిష్టము చేయుటకై సారస్వతమును శరణు జొచ్చిరి. ప్రాంతీయ భాషల ద్వారా తమతమ భావ సందేశములను వ్యాపింప జేసుకొనిరి. ఇట్లు చేయుటలో దక్షిణాది భాషలకు మరింత పటుత్వము చేకూరినది. ప్రజలనుండి భాషను వేరుచేయుట గాని, పాళి వారి భాషలనుండి ప్రజలను విడదీయుట గాని అసాధ్యమైన పని.

ప్రజల భావలో దాగియున్న వాఙ్మయమే నాగరికతకు పునాదిరాయి. ఒకసారి పునాది వేసినచో దానిని మార్పుచేయుట దుర్లభము. భూమాత ఇట్టి పునాదిరాళ్లకు పుట్టినిల్లు. అయితే భావి తరములవారి నిమిత్తము ప్రజలు ఆ పునాదిరాళ్లపై మహాభవనములు నిర్మించుట సహజముగదా! ఒక్కమ్మడిని సంస్కృతి పునరుజ్జీవనమునకు శక్తివంతమైన భావములను ప్రసరించుటకు దక్షిణ భారతము నాలుగు భాషా విభాగములై కృషి చేయ మొదలిడెను.

నాల్గింటను అతి ప్రాచీనమైన తమిళము క్రీస్తు పూర్వయుగము నందే గొప్ప వాఙ్మయమును గలిగి యుండెను. అప్పటి ప్రజల భావముల ననుసరించి ఆ రచనలు సాగినవి. తమిళ దేశమునకు వాయవ్య దిశలోనున్న కన్నడము ఆ దేశముతో చాలకాలము సన్నిహితముగ నుండి కొలది కాలము క్రిందటనే స్వతంత్ర భాషగ వెలువడినది. ఇరుగుపొరుగుతో రాకపోక సౌకర్యము లంతగలేని కారణమున పశ్చిమతీరమున మళయాళ భాష వెలసినది. విస్తీర్ణమున సుమారుగ ఈ మూడింటికి మించి ఉన్న ఆంధ్ర దేశము చాల శతాబ్దులుగ ఉత్తర దక్షిణాది వారిరువురికి కూడలిగా వ్యవహరించుటచే ఇటీవలి వరకు ఈ ప్రాంతమునకు ఒక నిర్దిష్ట భాష ఏర్పడక పోవుట సహజమైనదే కదా! అందుచేతనే తెలుగు భాషా పదజాలము నందును, నుడికారము నందును, వాక్య రచన యందును సంస్కృత, ప్రాకృత, ద్రావిడ భాషాచ్ఛాయలు నేటికిని గోచరించుట కద్దు.

భక్తి భావమునకు జన్మస్థానము దక్షిణ భారతమని జగద్విదితమే. భక్తి భావమునకు మూలమైన మహా భాగవతము దక్షిణాదినే రచింపబడినది. ఆళ్వారులు, నయనారులు ఆధ్యాత్మిక వాఙ్మయమును విరివిగ రచించిరి. కర్ణాటక దేశమునకుచెందిన "దాస" సారస్వతము కూడ రచన శైలిలోను, శైవ భక్తిని కలిగించుటలోను అద్వితీయ స్థానము నాక్రమించినది. శైవులు, వైష్ణవులు మత ప్రచారమున పోటీబడి తమతమ ఉత్తమ సారస్వతమును వెలువరించిరి. తమిళ సారస్వత రంగమున తిరువళ్లువర్ జరిపిన కృషి గణనీయమైనది. ప్రజా జీవనమునకు పటిష్టమైన సంఘ నిర్మాణమునకు దోహదములను కల్పించు విజ్ఞాన సర్వస్వము నొకదానిని రచించిన దీయనయే. ఇట్లు తమిళ, కన్నడ సారస్వత రంగములందు అమిత కృషి సల్పిన పాండిత్య ప్రకర్షకులు అనేకులు. భామరాజ్యానుభూతికి రాజబాటలు నిర్మించిరి. భాష

పోషకుల ఆదరణతో ఎక్కుమంది కవులు పండితులు గణనీయమైన శిల్ప ఖండములను దక్షిణ భారత సారస్వతమున సృజించిరి.

క్రీ. శ. 11వ శతాబ్ది రాజమహేంద్రవరమున జీవించి సంస్కృత మహాభారతమును తెనిగించిన నన్నయ తెలుగు కవితా పితామహునిగా పేరు పొందెను. ఇట్లే తమిళమున కంబరు రామాయణమును రచించి పేరు గడించెను. ఈ రెండును సారస్వత, ఔన్నత్యము, రచనా-శిల్పములను బట్టి ప్రథమ శ్రేణికి చెందినవి. అందుచేతనే అవి గ్రంథస్థములై రాదాపు వేయి సంవత్సరములైనప్పటికి అట్లే నిలచి యున్నవి. ఇట్లే కన్నడమున "పొన్న" విరచితమైన రామాయణము ప్రజానురంజకమై విరాజిల్లినది. అయితే కన్నడమున వీరశైవ సిద్ధాంత రచనలు, ముఖ్యముగ గద్య సాహిత్యమున, బహుళముగ సాగినవి. తెలుగుపై సీటి ప్రభావము ఇటీవలిదే. పూర్వ మధ్య యుగమునకు సంబంధించిన కన్నడము-తెలుగు సారస్వత రచనలను ఇద మిత్థమని నిర్ణయించలేము సామీప్యత చేతనో, తత్త్వ మతములపై భావ ప్రభావము చేతనో లేదా దక్షిణ భారతమున ఉత్తర ప్రాంతమంతయు ఒకే రాజ్య పాలనక్రింద నుండుట చేతనో తెలుగు కన్నడ కవులు పరస్పర సాన్నిహిత్యము గలవారై మెలగిరి.

విజయనగర సామ్రాజ్య కాలమును దక్షిణ భారత సారస్వతమునకు స్వర్ణ యుగముగ పేర్కొన వచ్చును. విజయనగరాధీశుల సాహిత్య సేవ గౌరవాదరణలు కొనియాడదగినవి. తెలుగు, కన్నడము, తమిళ వాఙ్మయములు గణనీయమైన ప్రగతికి గురియైనవి. ఈ కాలమున విజయ నగర స్థానములలోను, వారి సామ్రాజ్యమయిన తంజావూరు మొదలగు నాయకరాజుల కొలువులందను వెలువడిన సాహిత్య రచనలు లెక్కకు మిక్కిలిగా నున్నవి పదజాలమున ప్రతిబింబించియున్న కవితాశైలి మాధుర్యమునందును, భావ ఔన్నత్యమునందును నేటికిని వాటికవే సాటి. 16, 17, 18, శతాబ్దములలో వెలువడిన గద్య పద్య రచనలు నేటి రచనలకు మాతృ రూపములుగ నిలచినవి. ఈ నాటి కవులు, రచయితలు వాటిని మూలాధారముగ గొని వారి రచనలను సాగించుచున్నారు.

ఆంగ్ల విద్యాప్రభావముచేత ఇతర భారతీయ భాషలలో వలెనే దక్షిణ భాషలందుకూడ గద్య సాహిత్యము ఎక్కువైనది. అందును ముఖ్య ముగ కథ, కథానిక, వ్యాస రచనలు పేర్కొన తగినవి.

అట్లని దక్షిణ భారత వాఙ్మయము అనువాద, అనుకరణ సాహిత్య భూయిష్టమని తలంపరాదు. సాంఘిక వాతావరణ పరిస్థితుల ప్రభావము సారస్వతముపై ఉండుననుట నిర్వివాదాంశము. సాంఘిక, రాజకీయ భావానుభూతులు సాహిత్యమునందు ప్రతిబింబించుచునే యుండును. ఈ విధముగ పరిశీలనా దృష్టితో చూచిన దక్షిణ భాషా సారస్వతమునందు అనేక క్రొత్త పోకడలు గోచరించును. పదజాలము, శైలి, నుడికారముల విషయములలో ఆయా భాషలకున్న ప్రత్యేకత, విషయ మెట్లున్నను దక్షిణ దేశ వాఙ్మయము చదివి ఆనందించుటకు తగిన మాధుర్యముతో నిండి యున్నది.

(ఆకాశవాణి సౌజన్యంతో)



తేది........................

# సెలకన్నె

శ్రీ వై. సి. వి. రెడ్డి

శిఖరాగ్రపు క్షితి జమ్ముల
సెలవివార నవ్వుకొన్న
పువ్వుబోండ్ల తావి తలపు
కొండ దరుల కోన మొనల
కోపులెత్తి, మత్తుగొలుప
నిను మించిన గమన వేగ
మున దూకుచు గంధవహుండు
వెన్నాడెను — నీయందము
కన్నాకై కానుపించె
నేమో! పొదరింటి మాటు
కేగిన పోనీయడాయె....
నేమమ్మా సెలకన్నె
యెక్కడనుండి రాకడ!

సంధ్యారుణ కాంతులు నీ
సారపూరవాఃకణముల
బింబితమై పుష్పవితతి
జుంబించె, మనోహరముగ
సూనాస్త్రునియెద కోవల
శోభన భావాలు వ్రాల
కలకాలము కోనలలో
నిలచి వలచె గండశిలలు
కౌటిల్యత లేని విందు
కౌగిలికై మొగము వాచి;

కలిసులతో సౌఖ్య కేళి
లలిఝుంచు నటంచు భోగ
ముల రోయుచు పరువెత్తెదు
ఏమమ్మా సెలకన్నె
యెక్కడ నుండీ రాకడ !

మిన్నులు పసు చోటులలో
మిహిరాంశుని అమృతాంశమ !
కరగి కరగి జాలు వాఱి
కాలువలై యిందు శిలల
కరగించుచు నలరించుచు
కనకాచల తటములబడి
కదలికలో మెదలికలో
కమనీయ రసోల్లాసము
వెల్లిగొనగ, పల్లటీల
వెలిగొడుగుల నెత్తి, నుడుల
కలకల మీ కోనలందు
కలకవాఱి పలుకువాఱ,
కళలకోపులిగురు లెత్త,
కదలుచుంటి వెచ్చటికో !
యేమమ్మా సెలకన్నె
యెక్కడనుండీ రాకడ !



# సీతాఫలం

-శ్రీ తిరుమల రామచంద్ర

సీతాఫలం, రామాఫలం ఎంత తియ్యని పండ్లు! మనను కళ్లతోనే పిలుస్తున్నట్లు ఉంటాయి కదూ! ఆలంకారికులు ద్రాక్షాపాక మన్నారు గాని, సీతాఫలపాక మంటే బాగుంటుందని నా మనవి.

ఈ సీతాఫలం తెనుగునాడులో, ముఖ్యంగా తెలంగాణా, రాయల సీమలలో వన్యస్థితిలో కనిపిస్తుంది. మన రాజధానిలో ఒక పేటకు 'సీతా ఫల్ మండి' అనే పేరు మనకందరికీ తెలిసిందే. సీతాఫలం, రామాఫలం అనే పేర్లు అచ్చంగా సంస్కృతంవే గనుక మన దేశంవేనని భ్రాంతి కలుగు తుంది కదూ? కాని, నిజం వేరు.

ఆధునిక వృక్ష శాస్త్రజ్ఞులు ఇది మన దేశంది కాదని ఘంటాపథంగా చెబుతున్నారు. "అజంతా చిత్రాలలో సీతాఫలం ప్రతి రూపాలు, బార్హూత్ స్తూపంలో సీతాఫలం శిల్పాలు, మథుర శిల్పాలలో సీతాఫలం ప్రతి కృతులు కనిపిస్తూన్నాయి. ఇంతేకాక వీటికి దేవతల పేర్లు ఉండడమే ఇది దేశీయ మనడానికి నిదర్శనం."అని కొందరి వాదం. "అబ్బే! అజంతా, మథుర, బార్హూత్ స్తూపాలలో కనిపించే చిత్రాలు, శిల్పాలు పనస పండువే కాని సీతాఫలంవి కావు. పనసను చూచి సీతాఫలమని మోసపోకండి. రుచ్య మైన అన్ని పళ్లకూ పేర్లేవో ఉండగా, వీటికే దేవతల పేర్లెందుకు? అన్య దేశ్యాలు కనుకనే వీటి కా పేర్లు పెట్టారు. భయంకరంగాను, అసహ్యం గాను ఉండే వాటిని రాక్షసుల పేర్లతోను, అందంగాను రుచ్యంగాను ఉండే వాటిని దేవతల పేర్లతోను వ్యవహరించడం మన అలవాటు. రాకాసి మట్టలు, రాకాసి బొగ్గు, రావణాసురుని గుడ్లు, రావణుని మీసాలు- బాగ."అని మరికొందరి వాదం. మన దేశం లోను, ఇతరత్రాను, దీనికున్న పేర్లను పరిశీలిస్తే నిజం తేలుతుందేమో చూద్దాం.

హిందీలో దీనిని శరీఫా, ఆట్, ఆటా, సీతాఫల్, లౌనా అని అంటారు. గుజరాతీ, మరాఠీలలోను, ఇవే పేర్లు. అరబ్బీ—ఆటా, సరిహద్దు పుష్తో-శరీఫా, బేహ్లీ. బెంగాలీ-ఆటా, లూనా, నోనా, (సీతాఫలానికీ, రామాఫలానికీని) అస్సామీ- ఆటా, కాటాల్, ఫార్సీ- శరీఫా, కాఫ్,

లక్ష్మి– అపుజా, అఙ్హా. కన్నడం– సీతాఫలం, తమిళ్ – సీతాఫలం. తెలుగు– సీతాఫలం, సీతాఫలప్పండు. మొత్తం మీద భారతదేశ మంతటా ప్రచురంగా వ్యవహారంలో ఉండే మాట– "సీతాఫలం."

పాశ్చాత్య వృక్ష శాస్త్రజ్ఞులు దీనిని "అనోనా" జాతి పళ్లంటారు. అనోనా స్క్వామోనా– సీతాఫలం; అనోనా రుఴెకులటా– రామాఫలం. ఈ అనోనా అనే మాట మలయాళీ. ఈ జాతి పండ్లకు వాడే మనోవా అనే మాట వికృతి అని కొందరంటారు. బండా ద్వీపాలలో దీనిని మెనోవా అంటారట. "అన్నోనా అనే లాటిన్ పదం దీనికి మూలం. హాయన అనే సంస్కృత పదానికి సమానమైన అన్నస్ అనే పదమే అన్నోనా అనే మాటకు ప్రకృతి. అన్నోనా సంవత్సర ఫలం. సీతాఫలమూ ఏడాది పంట గనుక ఈ పేరు"అని అతి పాశ్చాత్యవాదు లంటారు.

పాశ్చాత్యుల వాదం ఎలా ఉన్నా ఇది మన సాహిత్యంలో ఉదహరించబడిందా– అంటే కనిపించదు. నామలింగాను శాసనం లాంటి ప్రాచీన సంస్కృత నిఘంటువు గాని, మొన్న మొన్నటి వాచస్పత్యం వంటి సంస్కృత విజ్ఞాన సర్వస్వంగాని దీనిని పేర్కొనలేదు. ఇటీవలి ఆప్టేనిఘంటువు, తెలుగు నిఘంటువులూ చేర్చాయను కోండి.

ఇది ఇక తెలుగు సాహిత్యంలో ప్రాచీనుల కంటబడినట్టు లేదు. ప్రజా జీవితాన్ని ఎక్కువగా తన రచనలలో ప్రతి ఫలింపజేసిన పాల్కురికి సోమన్న పండితారాధ్య చరిత్రలో పెక్కు పండ్లు చెప్పాడు. వాటిలో సీతాఫలం లేదు తెలంగాణాలో అంత విరివిగా వన్యస్థితిలో, పొదల్లాగ నేడు కానవచ్చే సీతాఫలం సోమనాథుని కాలానికి ఉంటే, అడవి గొగ్గి పళ్ల లాంటివి కూడ చెప్పినవాడు సీతాఫలం లాంటి స్వాదు ఫలం వదలుతాడా.? కబీరు, తులసీదాసు వంటి ప్రజా కవులూ దీనిని పేర్కొన్నట్టు లేదు.

కనుక, ఇది మన దేశంది కాదనే వాదమే సమంజస మనిపిస్తుంది? బెంగాలీలో నోనా, ఆటా అని, హిందీలో శౌనా అని ఈ జాతికి పర్యాయాలుండడం చూడగా, ఇవి అనోనా అనే విదేశపదాల భ్రష్టరూపాలేనని తోస్తుంది. అనోనా అనేది నోనా, శౌనా కావడం అసహజం కాదు. రెటికులటాలోని ఆటా మిగలడం అంతకన్నా అసహజం కాదు. ఇది ఉత్తర అమెరికానుంచి, వెస్ట్ఇండీస్నుంచి దక్షిణ అమెరికాకు అక్కడినుంచి

యూరప్‌కు వచ్చి బుడతకీచులద్వారా మన దేశానికి వచ్చిందనే వాదమే అంగీకరిద్దాం. అయితే సీతాఫలం అనే పేరుకు కారణమేమై ఉంటుంది?

దీన్ని బుడతకీచులు మన దేశానకి తెచ్చారని అనుకున్నాం కదా! ఆ తేవడం ఉత్తర భారతానికి తెచ్చారు. సీతాఫలంపై బెరడు చెక్కులు చెక్కులుగా, తేపలు తేపలుగా, కళ్లు కళ్లుగా ఉంటుంది కదూ! సీతాఫలంలో కొన్ని రకాల బెరడు కళ్లపై ఊదారంగు చుక్కలు, లేబసరు రంగు చుక్కలు ఉండడం అందరికీ తెలిసిందే. బాగా మాగితే నల్లటి చుక్కలు పడడం కూడా అందరూ చూచేదే. హిందీ లోను, మరికొన్ని ఉత్తర భారత భాషలలోను ఛీంటా, ఛీటా అనే పదాలకు బుడగ, బిందువు, బొట్టు, చుక్క (మచ్చ) అన్న అర్థాలున్నాయి. ఈ పండును ఉత్తరాది వారు మొదట చూచినప్పుడు, "ఛీటాఫల్, ఛీతాఫల్—"అని వ్యవహరించి ఉంటారు. అంటే పెచ్చులు పెచ్చుల, బుడగల బుడగల, చుక్కల చుక్కల, పండన్నమాట. ఈ పేరు దీని మాధుర్యానికి తగినట్టుగా కనబడి ఉండదు; వికారంగాను ఉన్నట్టు తోచి ఉంటుంది. ఇంత రుచ్యమైన పండుకు ఇలాంటి మచ్చల పేరు, బుడగల పేరు, చుక్కల పేరు ఏమిటనే భావన కలిగి ఉంటుంది. ఛీంటా, ఛీతాలు 'సీతా' శబ్దానికి కొంత ధ్వని సాదృశ్యం కలవి. ఏ మహానుభావుడో కొంత సంస్కరించి "సీతాఫల్" అని దేవతా నామధేయం ప్రసాదించి ఉంటాడు. అప్పటినుంచి దీనికి ఈ పేరు పడి ఉంటుంది- సీతాఫల్, సీతాఫలం, సీతాఫలం- అని.

చిన్న పండు సీతాఫలమైతే ఈ జాతిలోని పెద్దపండు ఏమౌతుంది? రామాఫలం అన్నారు. సీతాఫలం కన్నా చిన్నదైన మరొక పండును లక్ష్మణఫల్ అన్నారు. సీతారామలక్ష్మణులు విడదీయరాని వెలుగులు కదా!

సీతకాలం సీతాఫలాల పంట కాలం. కనుక— సీతకాలంలో వచ్చే పండ్లు గనుక- శీతాఫలం,— సీతాఫలం- అని కాగాడదా?- అని ఆక్షేపిస్తారు కదూ? నిజమే. కాలం, దేశం, సాదృశ్యం మున్నగు వాటిని బట్టి వస్తువులకు రకరకాల పేర్లు కాదనలేము. కాని, ఇది విదేశీయం కదా? బుడగలు బుడగలుగా ఉండేది కదా? కనుక ఛీంటా, ఛీతా అనే పదాల సంస్కృతీకరణమే సంభవమనడానికి అవకాశం ఎక్కువ.

# దివ్యజీవి

—శ్రీ ముకురాల రామారెడ్డి.

ఆమె కళా ప్రపంచ పరమావధి, ఆ సఖి విశ్వప్రేమకే
భూమిక, ఆమె వాక్కు వడబోసిన తత్త్వము, శైశిరమ్ములో
ఆమని వచ్చు భూమిపయి ఆమె పదమ్మిడ. ఆ మహోను కం
పామతి చల్వ గోరుదురు మధ్యమలోక నివాసు లెందరో.

ప్రతి చిత్రాయియు దేవతా ప్రతిమరూపమ్మై తరించున్; రసా
మృత మొల్కున్ ప్రతి పల్కులో; ప్రతి గళమ్మేదో సుధానాద సం
గతియై జాలను చెమ్మరించు; ప్రతి రేఖాచిత్రమున్ దివ్యజీ
వితమే గైకొను చిత్రరేఖ, యయి, నా ప్రేమాబ్ధి చూచాయలో.

ఆమె నా దొరసాని నేనామె దొరను,
ఇరువురము ఆత్మరాజ్యాల నేలుకొందు,
మెపుడు జరిగెనొ మా పెండ్లి యెఱుగరెవరు
పంచభూతమ్ము లవిసాక్షి, ప్రకృతిసాక్షి.

లీలగా ఆమె వరాలచేయి ఒకింత
మెదలెనా, స్వర్గమే కదలి వచ్చు
తీపి తీయములూర ఆపె గొంతెత్తి నం
తనె, విశ్వవీణ మూర్ఛనలదేలు.
నారాణి మేలిమి పారాణి ముద్దులు
గారెనా, మట్టి బంగారమగును.
నా జీవనజ్యోతి మైజిగర్జుగలలో,
మిణుగురుల్ చుక్కలు మేతలాడు.

ఇరువురము మేము గలసి పింగిరులువోయ
రాతిరి పగళ్ళు దాగుడు మూతలాడు.
మెడమెడల వల్లుకొనుచు మేమే జగాన
సాగి పోతున్న కాలమే ఆగిపోవు.

పూల కొతారు మేసి, పలుపోకల శిక్షితమైన గాలి గు
ఱ్ఱాలను దోలుచున్; పరిసరాలను గ్రమ్మిన కారు మబ్బులన్
చీలిచి కాంతిమార్గమును జెక్కుచు; చేతన కేతనాంకమీ
కాలరథమ్మ నెక్కి తిరుగాడుచు నుందుము విశ్వ వీథిలో.

అల్లన కల్కి గన్నుల వెలారిచి ఆమె హసించినంత, జల్
జల్లున మల్లెలే కురియు; జారును సాంధ్యరుచుల్; మొగిల్ తెరల్
వెళ్ళను సింగిణీలు; చదలేయి యెడారికి దారిగట్టి త్రో
పుళ్ళగవారు; కత్తిమెఱుపుల్ ఝళిపించును కాళరాత్రులన్.

చెలి నా వెంగటనుండెనా, చౌరవు కాసింతైన తాపత్రయా
దులు; హేమంత నిశీథులందుడుకుపెత్తున్ గాడుపుల్; మండుటెం
డలలో మంచులు రాలు; కొండలకొనల్ ధట్టించుచున్ మబ్బు దం
డులతోడన్ దిగు వానకారు లవి పాడున్ దివ్య సంగీతముల్.

ఏ దరిదాపు లేని ధనహీనుని నన్ను వరించి, తాను యెం
తో దయ చూపి, నా బ్రతుకు తోడయి నన్ బులిపించె-కావునన్
నా దొరసాని యేమడిగినా యెటు బిల్చిన యేమి గోరినా
కాదన లేను, ఆమె కడగన్నుల నీడన నిల్చి యుండుటన్.

శ్రీ గర్వాంధుల మూతి నాకు బ్రతుకాశించన్; ప్రభుత్వాలకై
జోగెత్తన్; తలతోకలేని అమనస్కుల్ నేయు వాదాలలో
బోగాముల్ గొనిరాను; లెక్కిడను సన్మానావమానంబులన్;
నా గీతమ్ముల నేనె పాడుకొని ఆనందింతు వారాణితో.

వీరపాత్మలు యెన్నడు చేరలేని
దూర దూరాల వెన్నెల దారులందు,
ముద్దు ముద్దుగ యేమేమొ ముచ్చటాడి
మురిసి మురిపించుకొందు మెందొరుల మేము.

మెరుపు తీగలకు పందిరిమాల, మాకు యీ
నీలాల జాడ అద్దాల మేడ.
వెన్నెల పూవునే వెక్కిరించెడి చలి
గట్టు, మా యింటికి కడప మెట్టు.
ఏ నాటి కెండని యేడు సముద్రాలు,
నానాట మాకు తానాల తొట్లు.
మంగళ జోత్స్న సమర్పించు, చక్ర భం
గిమలతో కాంతి గోళములు మాకు
మిత్రుడొకడేమి, శతకోటి మిత్రులకును
చోటు గల్పించు చుక్కలతోట మాది;
మట్టిలోకాన దిరిగెడి మానవుండ
చూడ రావోయి చుట్టపు చూపుగాగ.



# ఆముక్త మాల్యదలోని పాండ్యుని కథ

—శ్రీ పప్పూరి రామాచార్యులు

(గత సంచిక తరువాయి)

## శ్రీ విష్ణుచిత్తుని సేవానిరతి

పాండ్య దేశమున శ్రీ విలుపుత్తూరు అను పట్టణముకలదు. అందలి చక్రపాణియగు శ్రీమన్నారు కృష్ణుని ఆలయము ప్రసిద్ధము.

ఆ యూరు అందమైనది. నిరంతరము యాత్రికులగు భాగవతులు ఆ మన్నారు దేవుని సేవ కోసరము వచ్చు చుందురు.

చల్లని నీడ నిచ్చు నారికేళ వృక్షములు ఆ యూరికి పెట్టని తోడవులు.

నిత్యముమ ద్రవిడ పురంధ్రులు ఉదయముననే ఆ యూరి చేరువ నున్న ఏటిలోస్నానము చేసి, భుజముల మీద ఉదికిన చీరెలను, కటియందు మంచి నీటి బిందెల నమర్చుకొని నీరు చిందకుండ వానిలో తామర పువ్వులు వేసి దివ్యప్రబంధములు పాడుకొనుచు వచ్చుచుందురు.

ఆ పట్టణము నందలి వేశ్యలు జాణలు. కృతులు రచింపగల నేర్పరులు. వారు నిత్యమును స్వామి సేవ చేసెదరు. ఆలయములో ఆడెదరు, పాడెదరు. పురస్త్రీలు గూడ సుకుమార సుందరులు. వారి అలంకరణ సామగ్రి ముచ్చటయినది. బంగారు చిలుమనీ జవ్వాది బిడ్డనీ పూలు చెమ్మనీ వారు వానిని వాడరు. మణిముక్తాహారములను వలయములనే వారు వాడెదరు. కస్తూరిని రాచుకొందురు. ధూపములతో కురులను పరిమళింప జేసెదరు. పట్టు బట్టలు ఒత్తుకొనున్ని వానిని నిరసించి తెలుగు నూలి చీరెలనే ధరింతురు.

వీణా వాద్యము నందు స్త్రీలు కృతాభ్యసనలు.

ఆ పురి భాగవతులు అతిథుల నాదరించుటలో నితాంతశ్రద్ధ కలవారు. ఎదురేగి అతిథులను తోడ్కొని తెచ్చెదరు. వారికి సర్వోపచారములను చేసి భోజనానంతరము సదక్షిణ తాంబూలముల నొసగి దవ్వనిపి వత్తురు.

అట్టి భాగవత కుటుంబీకులలో మధురను మత్స్యధ్వజరాజేలు కాల మున ఒక పరమ భాగవత శిఖామణి యుండెడివాడు. సదా శ్రీ మహా

విష్ణువు మీద చిత్తము గలవాడగుట అతనికి విష్ణు చిత్తుడను నామము సార్థకమై యొప్పినది.

ఆ మహామహుడు శాస్త్రములను పఠింపలేదు. కాని ద్వయమంత్రోను సంధానము చేత అతనికి సమస్త శాస్త్రములందును వైదుష్యము కలిగినది. భక్తి వైరాగ్యములు మూర్తీభవించిన రీతిగా అతడు మన్నారు దేవుని సేవ చేసెడివాడు.

పుష్ప వనమును పెంచుట, స్వామికి నిత్యమును కుసుమ హారము లర్పించుట ఆయన తపస్సు.

సేవా పరతంత్రుడై మన్నారు మీద "అవ్యాజభక్తితో నిరవధి కానందము నొందు యోగికి బహుక్లేశదములైన చదువులతో పనియేమని ఆయన నిశ్చయము.

"చదువ దొరకొనినను నరునకు కాలంబు జాలదు. విఘ్నంబులు మెండు. ఇంచుక తెలిసినవానికి మదంబు హెచ్చును. లేక తుదముట్ట చదివినను సముత్పన్న విజ్ఞానుండై తేనెను గ్రహించినవాడు తెట్టెను వదలిపెట్టిన విధంబున త్రైగుణ్య విషయంబులను విడువవలసి వచ్చును గదా! పరమైకాంతినైన నాకు ఈ శాస్త్రములను నేర్చుట ఎందుకు, తుదకు విసర్జించుట ఎందుకు" అను దృఢ నిర్ణయ మతనిది.

న్యాయార్జితమైన విత్తములను ఆ యోగీంద్రుడు ఆసేతు హిమాచల యాత్రచేయు పరదేశి వైష్ణవులకు అన్న ప్రధానము చేయుటలో వినియోగించెడి వాడు.

వాన కాలమున జడిలోనైన గానీ అభ్యాగతు లరుదెంచినప్పుడు భార్య వండుట కనువుగా పొగరాజ కుండుటకు ఆ బ్రాహ్మణోత్తముడు ఎండిన టెంకాయ చిప్పలను, బొరియలను చేర్చి యుంచును.

వానితోనే ఆమె కల మాన్నమును, పప్పును, నాలుగైదు వేపుడు కూరలను, వరుగులు వడియములతో సహా సిద్ధము చేసెడిది. చేరెలకొలది నెయ్యి పెరుగుతో వారి భోజనము సంతృప్తికరముగా సాగెడిది.

వేసవిని కాలానుకూలమగు భక్ష్య భోజ్యములు ఆయన ఇంట సిద్ధమయ్యెడివి. మొదట అతిథులకు చందనము నిచ్చెడివాడు. తెల్లని వెచ్చని వరియన్నము మధురములగు వ్యంజనములు పలుచని అంబలి, చెఱకుపాలు,

ఎళనీరు, ఫలములు సువాసనతో గూడిన చల్లని నీరు ఖడపిందెలు, నీరు మజ్జిగ ఇత్యాది పదార్థములతో అతిథులు భోజనము చేయుచుండిరి.

మరి శీతకాలమున నైనచో పునుగు దాపుల వేడి వరి యన్నము, మిరియంపు పొళ్లు, చట్టి చుయ్యనునాదు ఆరకనే వడ్డించు కూరలు, ముక్కునకు ఘూటు వచ్చెడి రీతి ఆవపెట్టిన పచ్చడులు, పాయసము, ఊరుగాయలు, చెయ్యి చుఱుక్కను వేడిగలనెయ్యి, ఇగుర గాచిన పాలు, ఇవి భోజన పదార్థములు.

ప్రతి శనివారమును ఆయన ఇంట పరదేశీ వైష్ణవులకు తైలాభ్యంజనమునకు వలసిన అనుకూలము కల్పింపబడెడిది. ఒక చేతినిండ ఇప్ప పిండి దానిపై కుదురుగ నిల్పిన పెద్ద అరటి దొన్నెలో నువ్వుల నూనె, రెండవ చేత ఉదికిన దోవతికి కట్టిన త్రాడు పట్టుకొని వెళ్లి ఆ భాగవతులు శనివారమునాడు ఏట స్నానముచేసి వచ్చెదరు.

ఆ నిష్ఠానిధి గృహము నందు నడురేయి ఆలించినను, విష్ణుకథా వృత్తాంతములు దివ్యప్రబంధ పారాయణము వినబడుచుండెడివి.

వానికి తోడు అప్పుడే అరుదెంచిన అభ్యాగతులతో ఆమేటి గృహస్థు పల్కునట్టి "అయ్యా కూరలు చాలినన్ని లేవు. అన్నము చల్లారినది. పిండి వంటలు మిగుల లేదు. ఐనను అనుగ్రహించి ఉన్నవానితో తృప్తిగా భోజనము చేయుడు" అనునట్లు అనునయాలాపములును వినబడుచుండెడివి.

ఈ విధముగా ఆయన అలయక, వేసరక భగవత్సేవతోపాటు భాగవత కైంకర్యమునుకూడ చేయుచుండెను.

ఏ దినమున మధురాధి నాథుడగు మత్స్యధ్వజుడు ఇహమును రోసి మోక్షకామియై తనకు ముక్తి నియ్యగలవేల్పు ఎవ్వరో నిశ్చయింపుడని పండితులను ప్రార్థించి ఆస్థానమున బంగారు మాడల సంచి బహుమానముగా కట్టియుంచెనో, ఆ దినమున విల్లుపుత్తూరిలో శ్రీ విష్ణు చిత్తులవారు తులసీ సుగంధ మాల్యమును మన్నారు స్వామికి మంత్రయుక్తముగా నర్పించునప్పుడు స్వామి ఇట్లని ఆనతిచ్చెను:-

"మహామతీ, నేడే నీవు మధురకు పయనము గమ్ము. తొందరగా ఆ పురము చేరుము. పాండ్యరాజు ఇహమును రోసి ముక్తిపథమును వెదకుచున్నాడు. ఆయన దివాణము నిండను దుర్మదాంధులగు శుష్కపండితులు,

చేరియున్నారు. వారిని వాదమున ఓడించి అతడు వ్రేలగట్టిన శుల్కముమ గ్రహింపుము. పాండ్యుని మద్భక్తునిగా నొనర్పుము.

ఈ యాజ్ఞను విన్న విష్ణు చిత్తులవారు భయకంపితులైరి. స్వామికి సాష్టాంగ మెఱగిరి. వారి వెంట సముద్రాశ్రులు వెడలినవి. ఒంట పులుకలు తలచూపినవి. వినయ వినమిత గాత్రుడై ఆయన భక్తితో చక్రపాణి కీ విధముగా విన్నవించు కొనెను:-

"నేను పండితుడను గాను. శాస్త్ర గ్రంథ విషయమున జాత్యంధుడను. తమ కైంకర్యమునకు గాను ఆరామమును ఖనిత్రముతో నిత్యమును త్రవ్వుట చేత కాయలు గాచిన నా చేతులు కఠినముగా నున్నవి. తమ భవన దాసుడను నేను. వాదిగా నన్ను పాండ్యుని సభ కంపుచున్నారు. వాదమున నేనోడి పోయిన యెడల అపకీర్తి తమ కగును గదా!"

"కోవెల సమ్మార్జనము, తీర్థసేవ దేవరవారు విలాసార్థము వేంచేసిన పల్లకిని మోచుట, వనమాలికలు గ్రుచ్చుట, ధ్వజ గ్రహణము, ఛత్ర చామరములు ధరించుట, ముందఱగా గంద దీపమును వహించుట ఇట్టి పనులైనచో చేయగలను. వాదమునం దసమర్థుడనైన నా కంపెను స్వామీ, నీ లీలకు పాత్రులైన ఇతరులు లేరా?" అని చేతులు జోడించి నిలుచుండెను.

ఆ భక్తుని వినయమును స్వామి మెచ్చుకొనెను. చిఱునవ్వుతో శ్రీదేవి మోమును చూచి ఇతని చేతనే ఆ వాదము గెల్పింతునని మెల్లన పలికి యోగిపుంగవునితో ననెను.

"మునిప్రవరా! అంతయు నీ యిష్టమైనట్లే పల్కెదవు. నాయాజ్ఞను మిన్నక పాలింపుము. భూనాయకుని సభలో నీకుగెలుపు సేకూర్చెదను. నీ యత్నమిందులో అనవసరము. నేనున్నానుగదా భయంపడక పనిగొమ్మని మందలించెను.

ఆళ్వారులవారు ఈ ముదల విని మాఱుపలుక వెరచి పయనమునకు సిద్ధమయిరి.

కోవెల పారుపత్తి నంబిస్వామి ఆనతిగొని విష్ణుచిత్తుల వారికి పల్లకితోడి సర్వప్రయాణ సన్నాహములను సిద్ధపరచెను. సాధ్వీమణియగు ఆ విష్ణుచిత్తుని భార్య భర్త ప్రయాణమునకని ఎనటి పోతలుగా నేర్చిన క్షేమ తండులములు జీలకఱ్ఱ, బెల్లము, చింతపండు కలిపి దంచిన సంభారము, పేరిన

ఆవు నెయ్యి నించిన పిడతలు పెరుగువడియములు, పచ్చివరుగులు, కంది బేడలు, ఆరాధనపేటిక, పొరిఎళంగాయలు, ఆసిమిసంచులలోనించి ఆయత్త పరిచినది.

తన శిష్యులును చాత్తాద వైష్ణవులును ఈ సంబారములు మోసికొని వెంటనడువగా ఆ వైష్ణవోత్తముడు కతిపయ దినములకు మధురాపట్టణము చేరెను.

## వాద ప్రకరణము

శ్రీమాన్ విష్ణు చిత్తయోగీంద్రుల వారు మత్స్యధ్వజుని ఆస్థానమునకు వెళ్లునప్పటికి అప్పుడే సభ ఆరంభమై యుండినది. దిగ్దేశములనుండి వచ్చిన పండితులు మతవాదములు చేయుచుండిరి. ఒక్కరి వాదము నింకొక్కరు కాదను రాద్ధాంతములు చెలరేగెను. మహారాజుగారికి వాదములు తలదిమ్ము ఘటించినవి. ఆయన వేనినీ నమ్మజాలకుండెను. అనుభావరహితులును, వృథా తత్వజ్ఞులునగు శుష్కపండితులు చేయు శుష్కవాదములు సత్యదూరములని ఆయన భావించెను. కాని ఈ వాదోపవాదములను ఆయన సహించుచునే యుండెను.

నిరాటంకముగా పండితులు కొలువు కూటములోనికి పోనలవాటు పడియుండినందున దౌవారికుడు యోగీంద్రుని అడ్డగింపలేదు. రాజుగారికి విజ్ఞప్తిసి పంపకనే వాడు ఆయనను లోపలికి జొరనిచ్చెను.

దవ్వులనుండియే మహారాజు ఆ విప్రోత్తముని చూచెను. ఆయనలోని మహోజ్జ్వల తేజస్సు మహారాజునకు సంభ్రమాశ్చర్యములు కల్గించినవి ఆయనతోపాటు పండితులును ప్రత్యుత్థానముచేసి అర్ఘ్యపాద్యాది పూజలు చందన చర్చతోపాటు గావించిరి. నిశ్శబ్దముగానున్న ఆ మహాసభలో యోగీంద్రుని కంఠము కంచుఘంటవలె వినిపించినది. " పండితులారా ! మేము పరులమా ? మీ మీ వాదములనేల సాగింపక నిలిపితిరి. కానిండు. వానిని వినుభాగ్యము మాకును అలవడ జేయుడు " అనెను.

కతిపయ భాషణములలోనే విష్ణుచిత్తునికి వారి ప్రతిభ తెలిసిపోయినది. పాండిత్య పరిణతోపన్యాసములేగాని ఎదుటి వారికి విశ్వాసము గొల్పెడి సత్యాన్వేషణ గల నిశ్చయజ్ఞానము వారికడ లేదని ఆయన గ్రహించెను.

తన్ననిపిన శ్రీమన్ననారు తన చేతోగతి నొలయగా ఆతనిలో ఉత్సాహశక్తితోపాటు విజ్ఞానజ్యోతి వెలిగినది. చిఱునగవుతో ఆయన రాజు గారి నెమ్మొగమును తిలకింపగా, మహారాజు ఆదర దృక్కులతో "ఏమి సెల" వనెను. "మీరు మధ్యస్థులుగా నున్నచో మేమును కొన్నిమాటలు మనవిచేద" మను ఆయన కోరికను పార్థివు డంగీకరించెను.

ఆ భాగవతశ్రేష్ఠుడు క్రమముగా ఒక్కొక్క పండితుని వాదమును విమర్శించెను. అందులో గల దోషములను సభవారు ఔనన నిరూపించెను. ప్రక్కమాటలను అటు త్రోసి వారి వాదములోని సారాంశమును శ్రుతి వచనముల యాధారముతో ఖండించెను. ఒక్కొక్కసారి అందరును క్రందుగా రేగినప్పుడు కలతనొందక అందఱను దీర్చి మొదటివాని వాదమునకు మరలి వానిని విజితుని గావించి విడిచెను. 'నీ వేమంటివి తమ్ముని,' రెండవ వానిని పిలిచి వాని వాదమును గూడ ఖండించి క్రమముగా వాద సరణిలో నందఱను గెల్చెను.

జ్ఞాన స్వరూపమైన పరబ్రహ్మను ద్వైపాయన సూత్రములచేతను, వేదములచేతను నిరూపించి నాస్తికవాదమును కూలద్రోసి, విష్ణుస్వరూపి యగు ఆ పరతత్త్వమునకు మించిన దైవము లేదని విశిష్టాద్వైతమును ప్రమాణ వాక్యముచేత సిద్ధాంతీకరించెను.

ఆయన భాషణము ముగియుచుండగనే విద్యాశుల్కముగా వ్రేలగప్పి యుంచిన వరహాలసంచి పుటుక్కున తెగి ఆ యాళ్వారు మ్రోలపడినది. దివ్య దుందుభులు మ్రోగినవి. విరులవాన కురిసినది. పాండ్యమహారాజు సంతోషముచేత పెల్లుబ్బి సభ్యుల కిప్పించిన పారితోషికములు కొలువు కూటము నిండి ఎంత శోభనాపాదించినవి.

శ్రీవిష్ణుచిత్తస్వాములవారు ఈ విధముగా వాదమున గెలిచి విష్ణుతత్త్వమును ప్రకాశింపజేసి మహారాజును భక్తినోలలార్చి భగవత్ప్రసన్నునిగా జేసిరి. నాటికి సభ చాలింపబడెను.

వాదమున నోడిన వివిధ పండితులు విమనస్కులైరి. కొందఱు పెదవులు నాకుకొనుచు వెలియరుగు జూడకనే సింహద్వారమును దాటి పోయి పాదూవాహకులను ఎలుగెత్తి పిలిచిరి. కొందఱు తమ సమీపమున నున్న అందలమును దాటి దూరముగా పోయి బెస్తల కొఱకు కేకలు వేసిరి. ఇక కొందఱు నగరు వెల్వడు దాక ఒక్కొక్కరే నడచివెళ్లి నిలిచి

తోడి విద్వాంసుల గూడు కొనిరి. కొందఱు పండితులు ఎదురైన తమ వానిని గృహకృత్యమడిగి, వాడు చెప్పునది వినకనే ఊరక ఊ కొట్టుచుండిరి. త్రోవన ఎవ్వరైనను 'వాదమేమాయె' నని ప్రశ్నించిన యెడల భూపతుని పక్షపాత మా దాసరికి కల్గి బ్రతికి పోయెనని కొందఱు తమ అసూయను వెలికి సూచించిరి. ఇట్లు విమర్శదూరమైన వాకిట వసింపరాదని కొందఱు విసుగుకొనిరి.

కొందఱు విద్వాంసులు శృంగాటకములనిల్చి మంతనము లాడుకొని ప్రొద్దుపోయిన మీదట తమ గృహములు చేరుకొనిరి.

మహారాజు విష్ణుచిత్తుల వారిని గజారూఢిని జేసి తూర్యస్వనములతో విడిది చేర్చెకు. ఆ శుభసమయమున గరుడారూఢుడై శ్రీమన్నారాయణుడు ఆకసమున భక్తులకు సాక్షాత్కరించెను.

(సశేషము)

# గోపికా మధురానుభూతి

(సూరసాగరము నందలి యొక రమణీయ ఘట్టము)

—తెలుఁగుసేఁత: శ్రీ మైలవరపు సూర్యనారాయణమూర్తి

నందనందనుఁ దెలమి నందాంగణము నలమి
చిందులాడెడు చెలువు చిత్తంబులో నలమి
తాను భ్రాంతాత్మయై తాదాత్మ్యముంగొనిన
మానితోదంత మొకమానవతి వాకొనెను
కనులారఁ దిలకింపఁగా నొడల్ బులకింప
మనసు పులకింపఁ బ్రేమమ్ము మైమఱపింప
కన్ననిం గ్రన్ననం గన్నుల దువారంపు
దెన్ననం దెచ్చి హృత్ప్రీతి నింపు రహింప
నెలవిచ్చి కూర్చుండ నెలకొల్పి కనుతెప్ప
తలుపులను మూసి బంధమున నిడఁ గృష్ణప్ప
కప్పుమైచాయ ననుఁ గప్పుకొని నల్గొనల
కప్పు పొర కార్కొన్న కరణి దోఁచెను గనుల
నల్లవాఁడల్లుకొన్నను దెల్లవడె నుల్ల
మల్ల జగముల నెల్ల నల్లుకొన్నను నల్ల
అట్టి యీ నల్లవేల్పల్లుకొని నలుతట్టు
లెట్టు వెలిఁగించినాఁ డెడఁద చీఁకటికొట్టు,
సూరవిభుఁ బ్రాకృత శిశుస్వరూపుగఁ గంటి
మేరుగిరిఁ గురువిందమేరగాఁ గనుఁగొంటి
నీటి బొట్టొండు మున్నీట లీనంబయిన
పాటిగా నాయాత్మ పరమాత్మ భావమున

లీనమై గుణరూప లీలావిభేదమతి
లోనగున వెల్లగోల్పోయి యద్వైతమతి
మొలక విముడువౌ విత్తు, మొలకెత్తునో విత్తె,
మొలక విత్తుల పుట్టు మొదలెఱుంగని యట్టు
కృష్ణపరమాత్మునందే లీనమైతినో
కృష్ణుఁడే నాయాత్మ నెనసి లీనంబయెనో,
ప్రత్యేకతం గోలుపడి యైక్యమై కాంతుఁ
బ్రత్యేక వస్తువునఁ బరమాత్మ శ్రీకాంతు,
కనవచ్చెఁ గనువిచ్చి కన్నకడ లన్నింట
ఘనఘనాఘన నిభాకారుండె యేవెంట,
స్థలజలనభస్థలులు శ్యామసుందరుని గతిఁ
బొలిచి చూపట్టఁ గోల్పోతి లౌకిక నియతి,
పురజనుల గురుజనుల ముంగిటం గులసతులు
వెరపు లోకాచార నియత ధర్మము లెడలి
స్త్రైణసహజంబు లజ్జాగుణం బుడిగి, పర
మాణువును హరి మయంబని కాంచుచున్నతఱి
నన్నేదొ గ్రహమంటి నలఁచె ననుకొని త్రిప్పు
చున్నార వింటింటి కుపశాంతుల నొనర్ప,
నాయత్త హరిచింతనాయత్త నన్నుఁగని
తాయెత్తుఁ గట్టించె దయ్యమెదొ సోఁకెనని,
మంత్రతంత్రౌషధులు మందు మాఁకులు పెట్టి
యంత్రముల్ గట్టించి యఖిత రక్షను గట్టి
జేజేలకుఁ బ్రమొక్కుఁ జెల్లించి జపహోమ
పూజలన్ గ్రహశాంతిఁ బొనరించి కడుఁబ్రేమ

ఆర్తరము బడుచుండి రక్తమామలు నాకుఁ
　　చిత్త భ్రమమొ యంచుఁ జిత్రగతిఁ గనలేక
ఏమందునమ్మ ! నా కేమంచు హితమందు,
　　శ్రీమందిరుం డుండఁ జిత్తమందిరమందు.
తద్రూప రసగుణ సుధాస్వాదనము ముందు
　　చిద్రుపలు బోలు సంసృతి రసము లనుకొందు
మాకందె నెడఁచ సుషమాకందుఁ డౌ కందు
　　వాకొందునే లౌకికాన్యరసముల కెందు ?
ప్రాపించి హరిరూప రససుధం జవిగొన్నఁ
　　బ్రాపంచిక రసానుభవము నొకఁ డికొన్నె ?



గ్రంథస్వీకారం :—

శ్రీ రామానుజ చరిత్ర—శ్రీ రామానుజ దాసుడు.
నారాయణ శతకము—శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు.
మన వైదేశిక విధానము—శ్రీ మామిడిపూడి వేంకట రంగయ్య.
శ్రీ రామస్తోత్రావళి—శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి.

కథానిక :

# సమానాంతర రేఖలు

—శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు

ప్రకృతి సృష్టించిన నల్లటి చీకటిని చీల్చుకుంటూ భూదేవి నుదుట విధివ్రాసిన వ్రాతల తాలూకు గీతలలాగా సమానాంతరంగావున్న పట్టాల మీద, మెయిలు చకచకా గాలికన్న వేగంగా పరుగెత్తుతూ పోతున్నది. రైలు యింజన్ ముందున్న దీపపు కాంతి పట్టాలమీదపడి క్షణకాలం తళుక్కు మని మెరసిపోతున్నది. పట్టాల ప్రక్కనవున్న పొలాలలో మిణుగుడు పురుగులు చీకటిని వెక్కిరిస్తూ మెరుస్తున్నాయి. కీచురాళ్లు ఏదో ముంచుకొని పోయినట్లు అరుస్తున్నాయి.

టైం చూచుకున్నాడు మూర్తి. బండి బాగా లేటయింది. లేకపోతే తనీపాటికి యింట్లో ఉండేవాడు. ఈపాటికి యింటివగ్గర పిల్లలిద్దరూ తన కోసం ఎదురుచూస్తుంటారు. తన పిల్లలిద్దరికీ సర్వస్వం తనే! తనకు సర్వస్వం ఆ పిల్లలిద్దరే! తను ఆ పిల్లలిద్దరికోసం, ఆ పిల్లలు తనను చూచి బ్రతుకుమీద మమకారం కలిగించుకొని జీవిస్తున్నారు. తనులేకపోతే వాళ్లిద్దరికీ ఒక్క నిమిషం తోచదు. ఇవాళ బండిలోనే చాలా అలస్యమయింది. అప్పటికీ తను చాలావరకు ఆలస్యాన్ని, వేగంతో లాగివేశాడు. తనకోసం పిల్లలిద్దరు స్టేషన్ దగ్గరకొచ్చి వుంటారు. బండి కాస్త లేటయితే తనకేప్రమాదం జరిగిందో నని తల్లడిల్లిపోతారు. మరి- యీ జీవిత మింతేగా! ప్రాణాలతో సాము చేయటంలాంటిది. అదృష్టం బాగుంటే జీవితచక్రం సాఫీగా తిరిగిపోతుంది. వాలుతప్పితే బోల్తాకొట్టుంది. అందుకేగా ప్రభుత్వం తమకు అన్నిసౌకర్యాలుచేసి, కావాల్సినంత డబ్బునిచ్చేది! ఏ ముంటేనేం! తనకు సుఖంచే అదృష్టంలేదు. తనబిడ్డలైనా అన్ని విధాల హాయిగా సుఖస్తుంటే చూచి సంతోషించాలి. తన కోరికదే!

మూర్తి లేచి స్పీడోమీటరు తిప్పేడు. పట్టాలమీద గెంతులేస్తూ పాటలు పాడుకుంటూ పోతున్నది రైలు. ఏదో చిన్న స్టేషను వచ్చింది. లైనుక్లియర్ తీసుకొన్నాడు పాయింట్స్మన్. రైలు వచ్చి తననిద్ర చెడగొట్టినందుకో, లేకపోతే రైలు తన స్టేషనులో ఆగి తనను మాట్లాడించకుండా పోతున్నందు

కోగాని, స్టేషన్ మేష్టర్ నిద్రకళ్లతో, పోతున్న రైలువంక జాలిగా చూస్తున్నాడు. అయన్ని చూచేసరికి జాలి వేసింది మూర్తికి. ఒక్కడు పాపం! కటికచీకటి. ఊరుగాని అడవిలో స్టేషను. ఏం జరిగినా దిక్కూ-మొక్కూ-లేని జీవితం. కష్టసుఖాలను జీవితంతో పెనవేసి, విడివడరానివిగా విధాత మొదట్లోనే సృష్టించాడు కాబోలు ననిపించింది మూర్తికి.

నల్లనిముసుగు వేసుకొనివున్న ప్రకృతివైపు చూచాడుమూర్తి. హృదయంలో ఏ మూలనో దాగివున్న ఆలోచనలు చిన్నగా పైకిలేచి పడగలు విప్పి నాట్యంచేయటం మొదలు పెట్టేయి. బుర్రలో ఆలోచనలు లతలలాగా పెనవేసుకొని పోయాయి.

జీవితంలో హద్దులులేని ఆనందాన్ని అనుభవించటానికి అవకాశమున్న యౌవ్వనపు రోజులవి-

యౌవ్వనోత్సాహంతో గతుకులులేని బ్రతుకుబాటలో జీవనశకటాన్ని పరుగెత్తించిన తొలి రోజులవి—

ఆ రోజుల్లో బ్రతుకులోని లోతుపాతులు తెలియవు. జీవితమనే నందనోద్యానవనంలో, కబళించటానికి కాచుకొని క్రూరమృగాలు వున్నాయన్న సంగతి తెలియదు. సంసారసాగరంలోని మాధుర్య పుటలల ఆనందానుభూతుల ఆలోచనలు తప్పితే, అందులో నురుగులు గక్కుతూ క్రూరంగా, అతి భయంకరంగా తిరుగుతున్న సుడిగుండాల ఆలోచనలే లేవు.

ఉద్యోగంవల్ల కావల్సినంత డబ్బు వచ్చేది. వెనుక, ముందులకు తనొక్కడే. తను సంపాదించే డబ్బును అనుభవించటానికి తన వాళ్లనే వాళ్లు ఎవరూ లేరు. కావాల్సినంత స్వేచ్ఛ—హుషారు--పొంగి పొరలుతూన్న యౌవ్వనపు టానందం...జీవితాన్ని గురించి ఆలోచించాల్సిన అవకాశం గాని, అవసరం గాని లేదు.

సరిగ్గా యిలాంటి రాత్రే అది. ప్రకృతి ప్రళయ రూపంతో భయంకరంగా నాట్యం చేస్తున్నది. మధురమైన ఆలోచనలతో గూడ్సు యింజనును నడుపుకొంటూ పోతున్నాడు మూర్తి.

దూరంగా పట్టాల మధ్య నల్లటి ఆకారం కదులు తున్నట్లనిపించింది. చావు బ్రతుకుల మధ్య భీకర సంగ్రామం జరుగు తున్నట్లుంది. ఆ వ్యక్తి మొదటులో కాస్సేపు బ్రతుకులోని బాధలు గుర్తుకొచ్చి చావటానికి నిశ్చయానికొచ్చి పట్టాల మీద కొస్తున్నది. ఇంతలోకే చావులోని చేదును

బ్రతుకులోని మాధుర్యాన్ని ఊహించుకొని పట్టాలను తప్పుకొని పోయి వున్నది ఆ ఆకారం.

అనుమానంతో బండి స్పీడు తగ్గించాడు మూర్తి. బండి ఆ ఆకారానికి దగ్గరయింది. చావటానికి నిశ్చయించుకొన్నదేమో - ఆ ఆకారం రెండు పట్టాల మధ్యకొచ్చి నిల్చున్నది మృత్యువును ఆహ్వానిస్తూ!

బండి కోపంతో కరకర లాడుతూ ఆగిపోయింది. మూర్తి బండి దిగి ఆ ఆకారానికి దగ్గరగా వెళ్లేడు. మృత్యుదేవతకు తను ఆహుతి అయినా నన్న ధ్యాసతో అచేతనంగా నిల్చొని వున్నది ఆ స్త్రీ. మూర్తి ఆమెను తట్టి పిలిచేసరికి చేతనా ప్రపంచంలోకి వచ్చిన ఆమె, పరిస్థితిని అర్థం చేసికొని అచేతమరాలయింది మళ్లీ! కళ్లనుండి కన్నీళ్లు కారుతున్నాయి. దీపం వెలుగులో వెండి తీగెల్లా మెరుస్తూ!

బలవంతం మీద తను ఆత్మహత్య చేసుకోవటానికి గల కారణం చెప్పక తప్పలేదు, ఆమెకు తల్లి చిన్నతనంలో చనిపోయింది. తండ్రి పెంచి పెద్దచేసి, తమలాంటి పాంటరిగాడికిచ్చి పెళ్లిచేశాడు ఆమెను. పెళ్లిచేసిన కొద్ది రోజులకే ఆమె తండ్రి చనిపోయాడు. ఆమె మీద మక్కువతో వూళ్లోని వాళ్లెవరో భర్తను అన్యాయంగా, నిర్దాక్షిణ్యంగా హత్య చేశారుట! ఒంటరితనం తప్ప ఆమెకి ప్రపంచములో నా అనే వాళ్లెవ్వరూ లేక పోయారు. అందరూ ఆమె అందాన్ని జుర్రుకొని, జీవితాన్ని అపవిత్రం చేయాలని ప్రయత్నించే వారే! పొంచివున్న వారే...! వలలో పడ్డ లేడి లాగా గిజగిజ తన్నుకొంది బ్రతుకు కోసం కొన్నాళ్లు. కాని వూళ్లో వాళ్లు వల తాళ్లు గట్టిగా బిగించటానికి పొంచి వున్నారంతా! ఆ రాత్రి ఆమె మానాన్ని చెరచటానికి ప్రయత్నించారు కొందరు. ఎలాగోలాగా వారి నుండి తప్పించుకొని బయట పడింది. కాని బయటికొస్తే మార్గం? ఎటు చూచినా చీకటిలాంటి నిరాశ నిస్పృహాలు...కబళించి వేయటానికి చాచుకొని కూర్చున్న కబంధ హస్తాలు...ఒంటరితనం! ఏం చేయటానికి తోచలేదు. బ్రతుకులోని బరువు మోయలేననుకొని ఆత్మహత్యకు పూనుకొంది.

జీవితంలోని లోతుపాతులు తెలియని మూర్తి ఆ అభాగ్యురాలి కథ విని కన్నీరు కార్చాడు. అటువంటి అభాగ్యురాలిని మృత్యు ముఖం నుండి తప్పించినందుకు కెంతో గర్వ పడ్డాడు.

తనూ ఒంటరిగాడే! దిక్కు లేక, తిరుగుతున్న తనను ఒడ్డుకు చేర్చి దారి చూపించాడు తన కొక మహానుభావుడు. ఆనాడు ఆయనే తనని రక్షించక పోతే చదువు చెప్పించి...వుద్యోగం యిప్పించక పోతే...తన గతేమయి వుండేది! ఈనాడు యీ ఆనందం ఎట్లా వచ్చి వుండేది! గతిలేని వొక అబల కన్నీళ్లతో ఎదురుగ్గా నిలబడి వుంది. చేతనైన సహాయం చేయటం తన విధి. నిశ్చయంతో ఆమె వైపు చూచాడు మూర్తి.

నిరాశ నిండుకొని వున్న ఆమె మొహంలోని అందం అతడిని ఆశ్చర్య పరచింది. తెల్లటి కను బిందువుల వెనుక నల్లని కను పాపలోని కాంతి కిరణాల తళతళలు చూచి చలించాడు. పొంగి పొరలు తున్న యౌవ్వనంతో వొంపులు తిరిగి వున్న ఆమె శరీర లావణ్యం అతడిలో ఏవో మధుర భావనలను వింత వింతగా సృష్టించాయి. ఆమె అందాన్నీ, యౌవ్వ వాన్ని, రైలు చక్రాలకు పట్టాలకు అంకితం కాకుండా తప్పించి నందుకు తన్ను తానే అభినందించు కొన్నాడు. ఆమె ఒంటరి తనానికి తన వొంటరి తనం జత చేయాలని నిశ్చయించు కొన్నాడు.

ఆ మాటే ఆమెను అడిగాడు. సిగ్గుతో, బెదురుతో తట పటాయిస్తున్న ఆమెను దగ్గరకు తీసుకొని లాలించి బ్రతిమలాడేడు. ధైర్యం చెప్పేడు. ఆమె పట్టరాని ఆనందంతో అతని హృదయంలో తలదాచుకొంది.

జీవితంలో ఒడిదుడుకుల అనుభవాలతో తల నెరసిన వాడు కాక పోయినప్పటికీ- అనుభవాలతో పెద్దవాళ్లు వ్రాసిన పుస్తకాలు చదివి, ఆలోచించి మంచి చెడ్డలను తెలుసుకొన్న, మూర్తి మిత్రుడు, గార్డు- మూర్తిని చూచి నవ్వేడు.

'వివాహం జీవితంలో ఒక పెద్ద సమస్యరా భాయ్! నీ భవిష్యత్ జీవితపు బాగోగులకు, కష్ట సుఖాలకు నాంది యీ వివాహమే! యౌవనో ద్రేకంతో, తెలిసీ తెలియని అమాయకంతో, భవిష్యత్‌లోని బాగోగులను గురించి ఆలోచన లేకుండా తొందర పడి ఒక నిశ్చయానికొచ్చి, నీ జీవి తంతో నీవే చెలగాటం ఆడుకోవద్దు. ఒకటికి పదిసార్లు నీవు చేస్తున్న పనిని గూర్చి ఆలోచించుకొని చేయి మూర్తి!' చల్లటి మాటలలో ఎన్నో రహ స్యాలు యిమిడ్చి, నవ్వుతూ ఈ నీతి బోధ చేశాడు గార్డు స్నేహితుడిగా-

పట్టీ పట్టనట్లు, వినీ విననట్లు నిర్లక్ష్యంగా ఒక నవ్వు నవ్వేడు మూర్తి- స్నేహితుడి మాటలకు సమాధానంగా!

గార్డు మాటలకు బెదిరిన లేడిలాగా భయపడుతున్న ఆమెను తన కౌగిలిలోకి తీసుకొని ధైర్యం చెప్పాడు. ఆ నిమిషంలోనే ఆమెను లాయర్ లో మందు తున్న అగ్నిసాక్షిగా, తోటి ఉద్యోగుల ముగ్గురి సమక్షాన పెళ్ళి చేసుకొన్నాడు. గార్డు ...లోంచి ... నిట్టూర్పు వదిలేడు దీర్ఘంగా.

కొత్త సంసార యాత్రకు కావలసిన సరంజామాంతా ఉత్సాహంతో సమకూర్చాడు మూర్తి. ఏకూడింతా లేని సంసారం చల్లగా సాగిపోయింది. దిక్కూ గోరీ వాళ్ళిద్దరి ఒంటరి జీవితాలలోకి మరి రెండు జీవులు సంసారంలోనే వచ్చారు.

ఆ రోజు రాధ రెండవ పుట్టిన దినం పండుగ. సెలవు తీసికొని యింటిపద్దనే ఉండిపోయాడు మూర్తి. తెలిసిన నలుగురైదుగురు స్నేహితుల కుటుంబాలను, కొంతమంది ఆఫీసులో స్నేహితులను టీకు ఆహ్వానించాడు సాయంత్రానికి. పిలిచిన అతిథుల్లో మొట్టమొదట వచ్చాడు రాజారావు నాయుడు. ఆయన కొత్తగా వచ్చాడు ఆ వూరు రాగానే అతని కలుపుగోలుతనంవల్ల, తియ్యటి మాటలవల్ల వూళ్ళో పెద్ద వాళ్ళందరి పరిచయం సంపాదించుకొన్నాడు. పై ఆఫీసర్లచేత మంచి వాడనిపించుకొన్నాడు, అందరికీ అతనంటే అదో విధమైన గౌరవం-ప్రేమ!

సూటు, బూటు, వంకులు తిరిగిన జుట్టు, ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతుండే వెడల్పైన అందమైన ముఖం...అదో దర్జాగా వచ్చాడు లోపలికి.

'ఈమె నా మిసెస్ లక్ష్మి. వీళ్ళద్దరూ నా డాటర్స్'

'ఈయన మా ఆఫీసర్, స్నేహితులు — రాజారావునాయుడుగారు!'

నాగరికమైన పద్ధతిలో పరిచయం చేశాడు మూర్తి ఒకరి నొకరికి. చిరునవ్వు నవ్వుతూ లేచి చెయ్యి అందించాడు లక్ష్మికి కరచాలనంకోసం రాజారావునాయుడు. లక్ష్మి సందేహిస్తూ మూర్తివైపు చూస్తూ నిల్చుంది. 'ఓ! అయాం సారీ!' దీర్ఘంగా నిట్టూరుస్తూ కూర్చున్నాడు నాయుడు వెంటనే.

పార్టీ ఆనందంగా గడచిపోయింది. అనుకొన్న స్నేహితులంతా వచ్చారు. నాయుడు పార్టీలో హుషారుగా పాల్గొన్నప్పటికి, అతని తరహా అందరికీ ఆశ్చర్యం కలుగచేసింది.

'సారీ మిస్టర్ మూర్తీ! నీ భార్య చదువుకొన్నదని, సివిలైజ్డ్ అని అనుకొన్నాను. ఆమేమన్నా బాధపడుతుందేమో నా క్షమాపణలు అందచేయి' పోతూపోతూ మూర్తిని పిలిచి తూచినట్లుగా తన విచారాన్ని ప్రకటించి, క్షమాణ కోరుకొని పోయాడు నాయుడు.

మూర్తికి ఏదో 'షాక్' తిన్నట్లనిపించింది. తన పైఆఫీసరు... చదువుకొన్నవాడు...పారిస్ పోయివచ్చినవాడు ... తనకన్న అంతస్థులో గొప్పవాడు...తన అదృష్టంవల్ల తనింటికి వస్తే తను అమర్యాద చేసి పంపినట్లు బాధపడ్డాడు. ఇప్పుడు తను ఆయన దృష్టిలో అనాగరికుడు, తన భార్య అనాగరికురాలు...! మనసు కేదో కష్టం తోచింది.

'ఆ మాత్రం మర్యాద తెలుసుకోనక్కర్లేదా లక్ష్మీ! ఆయనకు చెయ్యి అందిస్తే వచ్చిన తప్పేమిటి! ఆయనెంత బాధ పడ్డారో తెలుసా?'

'నాకు తెలీదండీ! ఇంతకుముందు అనుభవం లేకపోవటంతో భయమేసింది. క్షమించండి. ఇంకెప్పుడూ అలా చేయను' చాలా బాధగా అని చేతుల్లో మొహం దాచుకొంది లక్ష్మి.

'ఫర్వాలేదు లక్ష్మీ! నీవు తప్పేమీ చేయలేదు. కాని మనం మెలుగుతున్నది నాగరిక ప్రపంచంలో. ఈ ప్రపంచంలో మన యిష్టమున్నా లేకపోయినా.. మనకు సాంప్రదాయమైనా కాకపోయినా ... కేవలం యితరుల మెప్పులకోసం మనం కొన్ని పనులు చేయాలి, పై మెరుగులు ప్రదర్శించాలి. లేకపోతే ఈ నవనాగరికమైన యీ సొసైటీ కూడా మనల్ని వెలివేస్తుంది. ఆయన నా పై ఆఫీసరు, పారిస్ పోయి పెద్ద చదువులు చదివొచ్చినతను, అందుకని అన్నాను. ఇకనుంచైనా కాస్త అటువంటివాళ్ళ దగ్గర చనువుగా వుండు లక్ష్మీ!'

అంతే...! లక్ష్మి ప్రవర్తన మారటానికి యీ సంఘటనే నాందీగీతం. క్రమక్రమంగా, కొద్దికొద్దిగా లక్ష్మి ప్రవర్తన మారుతూ వచ్చింది. ఇద్దరు పిల్లల తల్లయి వుండికూడా షోకులు, షికార్లు ఎక్కువయ్యాయి నాగరికుల్లాగా! మూర్తియింటికి నాయుడుగారి రాకపోకలు ఎక్కువయ్యాయి మూర్తి లేనప్పుడు. మూర్తి మొదట్లో చూచీ చూడనట్లు పోయాడు నిర్లిప్తంగా!

మరికొన్ని రోజులు పోయేసరికి, క్లబ్బులు, పార్టీలు. డాన్సులు, గొప్ప గొప్ప సమాజంలోని స్త్రీ పురుషులతో తిరగటం మొదలు పెట్టింది లక్ష్మి. ఆమె ఖర్చు ఆకాశ శిఖరాలను అందుకొంది. సన్నిహిత సమా

జంలోని స్నేహితుల గుసగుసలు మూర్తి చెవుల దగ్గరి కొచ్చిన తర్వాత సహించి వూరుకోలేకపోయాడు. తను డ్యూటీలో...పిల్లలిద్దరు ఒంటరిగా యింట్లో...భార్య సరదాగా షికార్లు! అనుమానం—బాధ—జుగుప్స—కోపం—రోషం—అసూయ—చుట్టుముట్టి సహనాన్ని చంపివేశాయి.

'చూడు లక్ష్మీ! నీ ప్రవర్తనను గురించి చాలా చెడుగా వింటున్నాను'

'అలాగా! విన్నవన్నీ నమ్మితే ఎలా!'

'విన్నవాటిని నమ్మినా నమ్మకపోయినా కళ్లతో చూచినవాటిని నమ్మకుండా వుండలేను. నువ్విప్పుడు ఎక్కడినుంచి రావటం?'

'మహిళామండలిలో డాన్సుపార్టీ అవుతేనూ...పోయి వస్తున్నాను'

'ఇంట్లో పిల్లలు ఏమయిపోతారనుకొన్నావు?'

'అదేమిటండీ కొత్తగా అడుగుతారు, పిల్లల్ని దాని చూడటంలేదూ! ఆమాటకొస్తే మహిళామండలి కొచ్చే యితర మహిళలంతా పిల్లల్ని ఏంచేస్తారనుకొన్నారు?'

'మొగుళ్ల మొహాన పిల్లల్ని పడేసి బడితెగి వస్తారనుకుంటాను, కాని నీవుమాత్రం అలా పోవటానికి వీల్లేదు యికనుంచి'

'వీల్లేదా! ఏం?' ఆశ్చర్యంగా అడిగింది లక్ష్మి.

'నాకింకా మానాభిమానా లున్నాయి కనుక. నీ యిష్టమొచ్చినట్లు తిరగటం నాకిష్టం లేదుగనుక. నీ భర్తనైన నేను చెప్తున్నానుకనుక!'

'క్షమించండి. ఆడవాళ్లని మగవాళ్లు శాసించే రోజులు పోయాయి. స్త్రీకి సంఘంలో పురుషుడితో సమాన హక్కులున్నాయి.'

'ఆ మాటలు మహిళామండలి సమావేశాల్లో చెప్పు. కాని యిప్పుడు నీతో మాట్లాడుతున్నది నీభర్త. ఆ విషయం జ్ఞాపకం వుంచుకో! వెళ్లు' తెలియని వుద్రేకంలో అరచాడు మూర్తి.

'ఏమిటండీ మీ మాటలు! నాకాశ్చర్యం వేస్తున్నాయి. ఇంతకీ నేనేం తప్పుచేశానని! అనవసరంగా మీ నీడనుచూచి మీరే బాధపడుతున్నారు! మీరు చెప్పిన నాగరిక ప్రపంచంలోకి పోయాను. అందులో ప్రముఖ స్థానం సంపాదించుకొన్నాను. ఇందులో నా తప్పేముంది!'

'అర్థంలేని యీ నాగరికతే నాకు పనికిరా దంటున్నాను'

'మీరే ఆనాడు నేను అనాగరికురాలనని అన్నారు!'

'అందుకని-నాగరికత అనే బురఖా తగిలించుకొని యింత నైచ్యాని కొడిగొడతావన్నమాట !'

'నైచ్యమా !'

'అవును నాకంతా తెలుసు లక్ష్మి! నా కళ్లకు గంతలు కట్టటానికి ప్రయత్నించి నా కోపాన్ని రెచ్చగొట్ట వద్దు. మళ్లీ చెప్తున్నాను. రేపటి నుంచి నా అనుమతి లేకుండా నీవు యిల్లు కదలి బయటికి పోవటానికి వీల్లేదు' గట్టిగా నొక్కి పలికాడు మూర్తి.

'వీల్లేదూ! అయితే యీ జైలు జీవితం అనుభవించటానికి నాకూ వీల్లేదు. నేను మీరు చెప్పినట్లు వినటానికి మీ దాసీదాన్ని కాను. తెలి...'

మాట పూర్తి కాకముందే లక్ష్మి చెంప పెళ్లు మంది. మరు నిముషంలో చెరచెర పొంగింది. కళ్లవెంట నీళ్లు గిర గిర తిరిగి ప్రవహించేయి. 'నా మాట విను లక్ష్మి! నేను యీనాడు నిన్ను కొట్టినందుకు నీవు బాధపడ నక్కర్లేదు. ఇంతకన్నా మంచి సహాయం చేశాను నీకు. ఒంటరిగా వున్న మనిద్దరి జీవితాలు ఏకమయ్యాయి. మన ఆనందానికి చిహ్నంగా ఆ పిల్లలిద్దరు పుట్టేరు. మన కీ జీవితంలో కావాల్సిందేముంది! ఇప్పటి నీ ప్రవర్తన భవిష్యత్తులో నీ పిల్లల జీవితాల కెంత మచ్చో ఆలోచించు. చావబోతున్న నిన్ను కాపాడి చేరదీసి దారి చూపినందుకు నీవు నాకు చూపించాల్సిన నీ కృతజ్ఞత యిదేనేమో ఆలోచించు. అన్నీ ఆలోచించుకొని నీ ప్రవర్తన మార్చుకొని, మన సంసారాన్ని సాఫీగా సాగిపోయేటట్లు చేయి. ఇదే నా కోరిక!' మనసులోని బాధను మాటల్లో నింపుతూ అన్నాడు మూర్తి. అన్న తర్వాత యిక అక్కడ వుండ లేక వెళ్ళిపోయాడు విచారంగా...!

లక్ష్మి ప్రవర్తన కాస్త మారుతున్నదనిపించిది మూర్తికి. షోకులు షికార్లు పూర్తిగా తగ్గి పోయాయి మూర్తి లక్ష్మిలోని పరివర్తనకు ఆనందించాడు మనసులోనే.

నాయుడు గారికి అక్కడి నుంచి ట్రాన్స్‌ఫర్ అయింది. ఆరోజే వెళ్ళిపోతాడు.

ఫస్ట్‌గ్రేడు డ్రైవరుగా ప్రమోషనొచ్చింది మూర్తికి. డ్యూటీ కాగానే త్వరత్వరగా యింటి కొచ్చాడు సంతోషంగా. బిక్క మొహాలు వేసుకొని కూర్చొన్న పిల్ల లిద్దరూ కనిపించారు. ప్రొద్దున పోయిన లక్ష్మి యింతవరకు యింటికి రాలేదు, మూర్తి కేమి అర్థం కాలేదు, పాలు పోలేదు.

పది దాటింది. లక్ష్మి యింటికి రాలేదు, ఏదో అనుమానం ఆవరించింది మూర్తిని. నాయుడు పొద్దునే ట్రాన్స్‌ఫర్ మీద వూరి కెళ్లేడు. లక్ష్మి పొద్దుటినుంచి కనపడటం లేదు. ఈ రెంటికి ఏదో అవినాభావ సంబంధం గోచరించింది. స్టేషనుకెళ్లి వాకబు చేస్తే అనుమానం బలపడింది. మండుతున్న కోపంతో యింటి కొచ్చాడు మూర్తి.

'అమ్మ ఎక్కడికి పోయింది నాన్నా! కన్పించిందా!' అయిదేళ్ల కుర్రాడు కాళ్లకు చుట్టుకొని ఏడుస్తూ అడిగాడు.

'అమ్మ...లాలా...యింటికి!' వచ్చీరాని మాటలతో జాలిగా అడిగింది రెండేళ్ల పసిపిల్ల రాధ.

హృదయం కరిగి నీరై కళ్లల్లో గుండా పారి వరదలు కట్టింది. 'వస్తుందమ్మా ... వస్తుంది' కన్నీళ్లు ఆపుకుంటూ, లేని నవ్వును మొహంలో తెచ్చిపెట్టుకొని వాళ్లకు ధైర్యం చెప్తూ కూర్చున్నాడు.

ఎదురుగ్గా బల్లమీద పేపర్ వెయిట్ కింద ఒక కాగితం స్వేచ్ఛ కోసం పోరాడుతోంది గాలి సహాయంతో. అనుమానంతో వణికే చేతులతో, తీసి చూచాడు.

......నమస్కారములు

నేనిలా చెప్పకుండా పోతున్నందుకు క్షమించమని అడగటం లేదు. అడగటం నాకు భావ్యం కాదు-క్షమించ లేరు మీరు! కాని పరిస్థితులను అర్థం చేసుకొన్న మీరు నా యీ పనికి ఆశ్చర్య పోరనుకొంటాను. మృత్యువు నోటినుండి రక్షించి పునర్జన్మ నిచ్చినందుకు మీకు నే నెప్పటికీ కృతజ్ఞురాలనే! అయినప్పటికీ నేను మీకు యీ ద్రోహం చేయవలసి వచ్చినందుకు బాధపడు తున్నాను. నాలో రెండుశక్తులు కొంత కాలం హోరాహోరీగా మనసుతో, హృదయంతో యుద్ధం చేశాయి' ఆఖరికి చెడే జయించింది.

నేను చేస్తున్నది తప్పని నాకు తెలియక పోలేదు. కాని నేను యీ నాడు చేస్తున్నపని, నా మనస్ఫూర్తిగా చేస్తున్నాననే దాని కన్న ఏదో అదృశ్య శక్తి నాచేత చేయిస్తున్నదంటే బాగుంటుంది. మీతో నా పూర్వ చరిత్ర చెప్పేను. కేవలం అవన్నీ అబద్ధాలు కాక పోయినప్పటికీ, అందులో కొంత అబద్ధం లేక పోలేదు. ఏమైనా మీరు అన్నీ నేనేనని నమ్మి కొన్నారు: ఇన్ని తెలిసి మీకు నేను ద్రోహం చేస్తున్నానంటే అది నా తప్పు కాదేమో!

నేను పుట్టింది నిరుపేదపల్లెటూరి కుటుంబములో. పెరిగి పెద్దా ద్నయింది కూడా, ప్రపంచ మంటే ఏమిటో తెలుసుకోటానికి వీలు లేని స్థితిలోనే. కాని కొన్నాళ్లకి నాకు విధి ఒంటరి తనాన్ని సంప్రాప్తింప చేసింది. తర్వాత ఎన్నెన్నో రకాలైన జీవితాన్ని ఆ వూళ్ళో, మొరటు మనుష్యుల తోనే గడిపాను.

నా జీవిత దశ మీ పరిచయంతో యింకో విధంగా మారింది. మన జీవితాలు సాఫీగా సాగిపోయాయి కొన్నాళ్లు కాని-మీరు మీచేజేతులా మళ్లా నా జీవితాన్ని మరొక వైపు, యింకొక మెట్టుపైకి పోయేటట్లు చేశారు. తప్పనిసరై ఏదో బాధతో మెట్లు ఎక్కి పైకెళ్లేను. స్వర్గంలాంటి లోకంలో వున్నట్లు ఆనందించాను. కొన్నాళ్లకు నైతికంగా మెట్లమీద నుంచి జారి క్రిందికి పడ్డాను. నరకం కనిపించ లేదు. ఆ ఆనంద వలయాన్నుంచి తప్పించు కోలేక యిలా పోతున్నాను.

కాని—నా పిల్లల విషయమే బాధగావుంది. కన్న కడుపు తీపి ! కాని దాన్ని కూడా మైమరిపింప చేస్తున్నది యీ లోకం ! అయినా అప్పుడప్పుడు బాధ పడేదాన్ని కాని వాళ్లకు మీరున్నారని తెలుసు. ఈ నాగరికత ప్రపంచంలో కన్నబిడ్డకు, తల్లికిగల మమకారాలు యింతేనేమో! లేకపోతే నేనిలా జాబు వ్రాయను. అన్నీ తెలిసి బలవంతాన మీతో బంధాలన్నీ తెంచుకొని పోతున్నాను. పిల్లలకు నేను లేని లోటు తీర్చమనే నా కోరిక. ఏ లోకంలో నైనా ఎక్కడైనా ఎటువంటి ప్రాయశ్చిత్తాన్నయినా నా పాపానికి పరిహారంగా అనుభవిస్తానేమో కాని యీ నా ప్రపంచాన్ని వదలి మీతో వుండ లేను. నేనెంత పాపినైనా మీరు నా ప్రాణదాతలు. మార్గదర్శకులు గనుక మీరు క్షమించరని తెలుసినప్పటికీ నా యీ చేతగానితనానికి క్షమించ మని కోరుతున్నాను. విధేయతతో— - లక్ష్మి

పదిసార్లు చదివేడు జాబుని మూర్తి. ఏమీ అర్థం కాలేదు. తెలిసి పోతున్నాను క్షమించమంటుందేమిటి ? లోకమంటుంది—ఆనందమంటుంది ! పిచ్చెత్తి పోయిన స్థితిలో వ్రాసినట్లనిపించింది మూర్తికి. కోపంతో పళ్లు కొరుకుతున్నాడు.

'అమ్మ యింకా లాలేదే ! ఎక్కడికి పోయింది నాన్నా ! మనమూ అక్కడికే పోదామా !' పెద్దదవుతున్న చిన్నపిల్ల రాధ దీనంగా అడుగుతుంటే అవమానం, కోపం, అసహ్యం కలిసి మనిషిని వుడికించి వేసేవి.

ప్రతీకారవాంఛ పడగ విప్పి, వికటంగా ప్రళయనృత్యం చేసేది. నాయుడున్న చోటికి పోయి ఆరాతీసేడు. ఎక్కడెక్కడో వెతికాడు. పోయిన చోటల్లా నాలుగు కళ్లతో చూచాడు. కాని ఫలితం శూన్యం !

ఫలించని ప్రతీకారవాంఛతోనే మూర్తికి కాలం గడిచి పోయింది. పిల్లల్ని గురించిన తీయని తలపుల్లో లక్ష్మిని గురించి ఆలోచించటం మానేశాడు. 'అమ్మా' అన్న తీయని పిలుపులో మాధుర్యాన్ని రుచి చూడటానికి నోచుకోని పిల్లలిద్దరికి తనే తల్లితండ్రి అయి వాళ్లని పెంచి పెద్ద చేశాడు. పెద్దవాడు యింజనీరింగ్ చదువు తున్నాడు. పిల్ల యింటరు పాస యింది. ఆ రెంటి కళ్లమీద మమకారంతోనే జీవితాన్ని నెట్టుకొని పోతున్నాడు.

టైం చూచుకున్నాడు. మూర్తి ఇంకో అరగంటలో తను వూరికి చేరుకో గలడు. ఆలోచనలతో మనసు, వొళ్లు బాధగా ఉన్నాయి. వొంగి పెట్టె తెరచి 'మందు' సీసా తీసాడు పైకి. గ్లాసులోకి కాస్త వొంచుకొని త్రాగి బద్ధకంగా వొళ్లు విరచాడు. ప్రశాంతంగా వుంది మనసు. శరీరంలో అలసట తగ్గిపోయినట్లనిపించింది. సిగరెట్ వెలిగించి గట్టిగా దమ్ములాగి సీసా పెట్టెలో పెట్టేశాడు. ఎదురుగ్గావున్న కంతలోగుండా పట్టాల మీదకు పోయింది అతని దృష్టి.

బండి పెద్ద వంపులోకి ప్రవేశించింది. ముందుకు దూసుకుపోతున్న దీపపుకాంతిలో ఆ వైపు వంపులో పట్టాల మధ్యగా నిశ్చలంగా నిలబడివున్న ఒక ఆకారాన్ని చూచాడు మూర్తి.

ఏం చేయటానికి తోచలేదు మూర్తికి. గంటకు అరవైమైళ్ళ వేగాన్ని చూపిస్తున్నది స్పీడోమీటరు. ఆలోచించటానికి టైం లేదు.

బ్రేకు మీద చేయి వేశాడు. వెంటనే రైల్లో హాయిగా నిశ్చింతగా తనను నమ్ముకొని నిద్రపోతున్న ప్రయాణీకులు జ్ఞాపక మొచ్చారు. పాపం ! జీవితంలోని మధురమైన కోరికలను నెరవేర్చుకోటానికి, ఎన్నెన్నో వూహాలతో ఎన్నెన్నో వింత వింత ఆలోచనలతో, ఎన్నెన్నో ప్రదేశాలకు, ఎన్నో పనులతో పోతుంటారు రైల్లోవాళ్లంతా ! తనుఒక్కడు, ప్రాణాల మీద ఆశ వదలు కొంటే వాళ్లందరినీ క్షణంలో నామరూపాలు లేకుండా చేయవచ్చు.

అసలే పెద్దవంపు. ఆ వంపులో అంతస్పీడుగా పోతున్న బండిని సడన్‌గా ఆపెయ్యటమంటే మృత్యువుతో చెలగాటాలాడటమే! ప్రయాణీకుల ప్రాణా

లతో దోబూచు లాడటమే ! కాని చూస్తూ చూస్తూ ఒక మనిషి నిండు ప్రాణాన్ని తీయలేడు.

ఏ నిశ్చయానికి రాలేకపోతున్నాడు మూర్తి.

కాలమూ, వేగమూ పోటీలు వేసుకొని పరుగెత్తుతున్నాయి వేగంగా...!

ఒకవైపు చావటానికి నిశ్చయించుకొని, అన్ని సన్నాహాలు చేసుకొని వచ్చిన వ్యక్తి, రెండవ వైపు-బ్రతుకుమీద మమకారంతో, వింత వింత కోరికలతో, జీవితాన్ని గురించి మధుర స్వప్నాలను కంటూ—తన మీద నమ్మకంతో, హాయిగా వళ్లుమరచి నిద్రిస్తున్న ప్రయాణీకులు!

బుర్ర తిరిగిపోతున్నది మూర్తికి, ఏమైనా సరే తన రైలుకు, రైల్లోని ప్రయాణీకులకు ఏ ఆపదా రావటానికి వీల్లేదు. ఒక వ్యక్తికోసం యిందరి ప్రాణాలను తను అనవసరంగా బలిపెట్టలేడు. తన ప్రాణాన్ని గూడా త్యజించలేడు. కాని సాధ్యమయినంతవరకు ప్రయత్నంచేసి, తన చేతులారా చూస్తూ చూస్తూ వొక వ్యక్తి ప్రాణం బలి అయిపోకుండా చూడాలి. అంతే...

మూర్తి అప్రయత్నంగా ఒక గాఢమైన నిట్టూర్పు విడిచాడు.

ఇంజను దిగులుగా అరచింది. బండి వొంపు తిరుగుతున్నది. నెమ్మదిగా బ్రేకును కాస్త కాస్త నొక్కి పడుతూ, వదులుతూ, అతి చాకచక్యంగా బండి స్పీడును కాస్త కాస్తగా తగ్గిస్తున్నాడు,

కాలాన్ని వేగం జయించింది. బండి వొంపు తిరిగింది. స్పీడు తగ్గింది. ఆకారం దగ్గిరి కొచ్చింది. ఎంతో దూరంలేదు. జీవితంమీద సంపూర్ణమైన విరక్తితో, చావుకోసం పరితపించే వ్యక్తిలాగా, నదురుబెదురు లేకుండా నిశ్చలంగా, నిర్వికారంగా, నిర్భయంగా, నిల్చొనివుంది ఆ ఆకారం. మూర్తి సడన్ బ్రేకును వొత్తేడు. పెద్దగా శబ్దం చేసుకొంటూ నెమ్మదిగా నడుస్తున్నది రైలు కరకరలాడుతూ !

ఆకారం కదల్లేదు. రైలు పూర్తిగా ఆగనూలేదు!

రైలుకు, ఆకారానికి దూరం దగ్గరయింది. తక్కువ దూరంలో అంత వేగాన్ని తగ్గించటంవల్ల, రైలు వెంటనే ఆగటానికి వీల్లేకపోతోంది. ఆకారం తొలిగేటట్లు లేదు. రైలు ఆగకపోతే ఒకవేళ...! తన శ్రమంతా వృథా అవుతుంది.

ఆతుర్దాగా చూచాడు ఆకారంవైపు. తెల్లటి దీపపు కాంతిలో ఆ వ్యక్తి మొహం స్పష్టంగా కన్పించింది మూర్తి కళ్ళకు ! అంతే... !

మనసులో ఏమూలో దాగివున్న ఆలోచనలు తలెత్తాయి. మనిషి పూర్తిగా వణికిపోతున్నాడు. పెదిమలు అదరిపోతున్నాయి. మొహం వికృతంగా మారిపోయింది. కాళ్లు తేలిపోతూ నిలపటంలేదు.

హృదయంలో విశ్రాంతి తీసికొంటున్న మమకారం - ప్రతీకారం కడలి కెరటాలులాగా వుధృతంగా పొంగి పైకొచ్చాయి. బుర్ర పని చేయటం మానేసింది. నరాలపట్టు తప్పుతోంది.

బ్రేకుమీద చేతిలోని నరాల పటుత్వం తప్పి క్రిందికి వాలిపోయింది.

ఓడిపోతున్న కాలం వేగంమీద ప్రతీకార వాంఛ తీర్చుకొంది. ఆగబోతున్న రైలు ఆగకుండా వేగాన్ని పుంజుకొని ఆనందంగా పరుగుతీసింది అంతా ఒక్క క్షణం...!

మరుక్షణంలో నిల్చొన్న ఆ ఆకారం నిలువున నరకబడింది. భూదేవికి బొట్టుపెట్టి, పేరంటానికి పిల్చి పోతున్న రైలులోనుంచి ఏదో వస్తువు విసరివేయబడ్డట్లు పడింది నిశీధ ప్రకృతిలోకి ! బాయిలర్‌లోని నిప్పు భగభగ మండుతోంది-భయంకరంగా... !

# మధూలిక - దాని ప్రాబంధికత

— శ్రీ ఆర్. కె. మొగసాటి

(మార్చి సంచిక తరువాయి)

## ప్రాబంధికుల సమాస ధాటి

"సరభసోత్కట వేగ సంచాలి తోర్మిక
తటగళంబును గొట్టి తల్లడిలుట
నిర్ధూమ శైల వినిర్యన్నిరు ద్వీచి
శిశిర శాఖల బొచ్చి చిరుసడుట
గగన గండ స్థలి నెగసి పట్టగలేక
విదియ శీతాంశుడు దిగ్గున్న చోట
నిపుణ ధనుష్కాండ నిర్ముక్త నారాచ
గమనము లక్ష్య విస్ఖలిత మగుట
పోల్చుకోలేని యాబాల ప్రొద్దు పొడుచు
వేళ కగ్గిన దీపమై విన్న బాటు
తొంగి చూచిన మోమునై తొల్లియిట్టి
వింత యనుభూతి పొందని వేలయయ్యె"

దీనిలో మళ్లీ పత్త పద గాంభీర్యమే కాదు. ఎన్నో సజీవములైన పోలికలు ఉన్నాయి. సమాసంలో కాకుండా విడి మాటల్లో ఛందో వేగం తోనే ఆ సమాస ధాటిని సాధించిన స్థలాలు చాల ఉన్నవి.

"ఆసేనాని మహా భయంకరుడు, ప్రత్యర్థి ప్రజా జాతపుం
గాసంరమ్ముకు కొమ్ముచేస్గు, సుగధా కాశాగ్ని గోళంబు, సే
నాసారధ్య విదుండ మోఘు పద విన్యాసుండు వక్రంబులౌ
మీసల్ కన్నులు కెంపు, తీక్షణలు క్రోమ్మించుల్ ప్రచండుండహో"

## అలంకారాలలో సొగసు

ఈ అభ్యుదయ ప్రబంధం నిండా ఉపమాలంకారాలెక్కువ కని పిస్తాయి. అక్కడక్కడా అర్థాంతర న్యాసాలంకారాలూ, ఉత్ప్రేక్షాలంకా

రాలూ సమయస్ఫూర్తిగా ఎదురౌతాయి. కొన్ని చోట్ల భారతీయాలంకారా లలో పాశ్చాత్యాలంకారాలు పెన వేసుకుని పోయి తమ విశ్వభాషా సౌభ్రాతృత్వాన్ని నిరూపిస్తున్నాయి.

"పసిమిని మ్రానుగాయల సువాసనలన్ దిని పుక్కిలించె గ్రాం
బసిడి పొలాలు నింపి చనుబాలను గర్భిణులట్లు నూహలో
మసలిన కోర్కెలేవొ పవమానునితో వచియించు చుండె నా
కసమున మబ్బులింక తిరుగాడుట మాన్పవొయన్న పోలికన్"

ఇది ఉత్ప్రేక్షాలంకారములో సొగసు. పొలములను గర్భిణీ స్త్రీలతో పోల్చడం. ఇక్కడ మానవీకరణమనే పాశ్చాత్యుల అలంకారము భారతీయుల ఉత్ప్రేక్షాలంకారముతో కలిసినది. దీనిని బట్టి చూస్తే యీ కవి బహు భాషా పాండిత్యం కలవాడిలా కన్పిస్తున్నాడు, ఈయన తన కావ్యశ్రీ యొక్క సర్వాంగాలను సౌష్టవంగానూ, సుందరంగాను నిర్మాణించు కున్నాడు.

## స్నిగ్ధ భావాలూ - తెలుగు మాధుర్యం

అత్యంత స్నిగ్ధములైన భావాలును, తెలుగు జాతీయాలతో ఒంపులు సొంపులు తీర్చిన పద్యాలు యీ కావ్యంలో చాల ఉన్నవి.

"పుల్కు పుల్కున నాయమ" 431 పద్యం
"కన్నగవ ..." 432 ,,
"మగిడికడచన్న ..." 433 ,,
"హుమ్మను నెదవిప్పి ..." 434 ,,

ఈ పద్యాలు చదువుతుంటే ఏ చిమ్మపూడో, ఏ చామకూరో జ్ఞాపకం వస్తారు.

"ఒక పల్లె నానల్ల నొలగెనయ్యో
పది మంది గుడిచిరే బసరమైతి" 439 పద్యం.

ఈ పద్యంలో మనకు తిక్కన తలుపుకు వస్తాడు.

సందర్భ శుద్ధికి అల్లసాని పెద్దన పెట్టినది పేరు. వరూధినీ ప్రవరుల సంవాదము దీనికి తార్కాణము. కాని దీనిలో మధూలిక - పరదేశి సంభాషణ (చివరి ఘట్టంలో) మనస్సును గిలిగింతలు పెడుతుంది. ఒక

మహోన్నత తాపత్య్రపు పర్వతసానువు ముందు రెండు యౌవనపు సెలయేళ్లు దాగుడు మూతలాడు కుంటున్నట్లుంటుంది.

## శ్లేషలు

ఈ కావ్యంలో అక్కడక్కడా శ్లేషలు కూడా ఉన్నాయి.

"భారము భారమీ బ్రతుకు" ౩౬౯ పద్యం

పల్లెకారికి భగవంతుని సంబంధించిన అర్థం.

జీవనము = నీరు, జీవితము

విస్తారగుణుండు = విస్తారమైన తాడు కలవాడు (పల్లెకారి)

విస్తారమైన గుణములు కలిగినవాడు (భగవంతుడు)

సంస్తారణ ధాముడు = దాటించుట అను వృత్తి మీద స్థిరనివాస మేర్పరచుకున్నవాడు (పల్లెకారి). సర్వ జీవులను దాటించు వాడు (భగవానుడు)

పురుషార్థపరుడైన కవి మధూలికను కూడ దైవాధీనం చేయదలచుకో లేదు కాబట్టి అయినా దైవస్మృతిలో భగవంతుని తలచుకోకపోతే రసస్థాయి రాని సంప్రదాయం ఒకటి ఉంది. కాబట్టి కవి యిక్కడ దానిని శ్లేషతో తప్పుకుని రెండు పనులూ చేశాడు. ఈ శ్లేష ప్రయోజనం యిది. కవి యిక్కడ తన శ్లేషా పటుత్వ ధాటిని అతి నిపుణంగా వెల్లడించి తన సమగ్ర పాండిత్య శక్తిని సహజంగా ప్రదర్శించాడు.

## పాత్రచిత్రణలో లోపం

ఈ కావ్యంలో పాత్ర చిత్రణను సమగ్రంగా వెదకటానికి ప్రయత్నించ కూడదు. అసలిది కథా ఘటనలను ఒక క్రమంలో సృష్టించుకున్న కావ్యం కాదు. ఘటనా ప్రధానములైన పురాణములలో అలాంటి చిత్రణలకు అవకాశం ఉండవచ్చు. చలన చిత్రాలు నవలలలో లాగా కావ్యంలో కథ పాత్రల మీదే పడి వుండకూడదు. కావ్యంలో కవి ఒక మహా సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించడానికి అనేక భావోల్బణాలతో బరువెక్కిన హృదయాన్ని ఒక చిన్న కథ అనే రాతి మీద కొట్టి పగిలిస్తాడు! కథ పాత్రలు అనే సన్నని పొరలలో నుండి తన వ్యక్తిత్వపు ప్రతిబింబాలను బయటికి పంపిం

చుతాడు. దీంట్లో కథ ముందు కాదు. కవే ముందు. కవిని బట్టి మధూలిక. మధూలికను బట్టి సన్నివేశాలు. వానిని బట్టి కథ. ఇదొక వినూత్నమైన కావ్యఫక్కి.

కథాబద్ధమైన సరణిలోనే కావ్య వ్యక్తిత్వం నడవాలని ఎక్కడుంది? కావ్య వ్యక్తిత్వాన్ని బట్టి కథ నెందుకు నిర్ణయించుకో గూడదు? దారి ముందా నడక ముందా? దారే ముందని మనకు కనుపించ వచ్చు కాని అసలు నడకే ముందు. నడకను బట్టి దారి యేర్పడు తుంది. కాబట్టి యీ కావ్యం నడచిన తీరును బట్టి దీని కథ, దీని పాత్రలు, దీని ప్రత్యేకత అని మనం గమనించాలి. ఇలాంటి శంకలు కలుగుతాయనే ముందుగా కవి దీనికి ప్రబంధం అని పేరు పెట్టాడు. ఇలా మనకు ఎదురయ్యే అనేక ప్రశ్నలకు దీని అర్థోక్తి నుండి సంతృప్తి కరమైన సమాధానాలు చాల దొరుకుతాయి.

## ముగింపు

మొత్తం మీద యీ "మధూలిక" పూర్వ ప్రాబంధిక సరణిలో గమిస్తూనే ఎన్నో మహత్తర విజయాలను సాధించింది. సరిక్రొత్త నిర్వచనాల వెన్నో యీ కావ్యం నినదిస్తుంది. ఈ మధూలికలోని నిర్వచనాలూ, భావాలూ ప్రాబంధికతలో పేరుకొని పోయివున్న ఎన్నో మూఢనమ్మకాలను విరుగ గొట్టి ప్రపంచాన్ని పరమార్జన చేసి మాధ్యమిక యుగారంభమున మానవతలో జొరబడి స్థాన మేర్పరచుకొన్న దానవతను ప్రకటించి ముందు కొక సంకేతాన్నిస్తుంది.

వివిధ మారణాస్త్రాల ధన ధనా రావాలతో, ఖండ, ఖండాతర, గ్రహాంతర్యాన ప్రయోగ ప్రమాదావస్థలో బడి ప్రపంచం కొట్టు మిట్టాడు తున్న యీ విషమ సమయంలో శ్రీ దుర్గానంద్, శాంతి దూతగా తన మధూలికను రూపొందించి కావ్యాదర్శమైన విశ్వశ్రేయాన్ని కర్ణపేయంగా గానం చేయిస్తూ అభ్యుదయ సాహిత్య యుగకర్తగా తన కర్తవ్యాన్ని నెరవేర్చి తన్నొక విశాల విశ్వంగా నిరూపించు కున్నాడు. 

 స్రవంతి 

| | | |
|---|---|---|
| వార్షిక చందా | .... | రు. 4—00 |
| విడిప్రతి | .... | 0—35 |

**పుస్తకపరిచయము:**

# నన్నెచోడుని కవిత్వము

రచన: శ్రీ అమరేశం రాజేశ్వర శర్మ.

ప్రచురణకు: అజంతా పబ్లికేషన్సు. సికింద్రాబాదు. వెల: 4 రూ.

ఇది నన్నెచోడుని యొక్కయు వాని కుమారసంభవ కావ్యము యొక్కయు బహ్వాంశములకు సంబంధించిన విమర్శనగ్రంథము. నన్నెచోడుని కాలమునకు చర్చ అంతగా లేక కేవలము గ్రంథముపైన విమర్శన మగుటవలన ఈ ప్రయత్న మభినందింపదగి యున్నది. కొంత కాలమునుండి ఆచారముగా వచ్చుచున్న విమర్శనమార్గముననే ఈ గ్రంథ మున్నది. ఆ మార్గ మిది. కవి దేశకాలములు, మతము, కులము, గోత్రము, కావ్యములోని వస్తువునకు మూలములు; ఆ కవిపై పూర్వకవుల ప్రభావము; ఆ గ్రంథమున అష్టాదశవర్ణనలు; ఇత్యాదులన్నమాట. అధికముగా నుదాహరణములతో నీ మార్గమున సాగుటనుండి ఈ నన్నెచోడుని గ్రంథము పూర్తిగా తప్పుకొనలేదు. కొంచెము తక్కువగా సగము గ్రంథము కుమారసంభవమునందలి అష్టాదశవర్ణనములను గురించి వ్రాయుట కైనది. శ్రీ శర్మగారు కొన్ని కొన్ని వర్ణనములు కథాగతి కుపస్కారము లెట్లయినవో చూపుటకు చేసిన యత్నము బాగున్నది. అది యింకను పరిణతికి రావలయును. ఈ విమర్శన గ్రంథమున ప్రధానమైన అంశములు మూడుగా కనిపించుచున్నవి. ఒకటి వస్తుకవితా విచారము. రెండు పద్యౌచిత్యవిచారము. మూడు కుమారసంభవ మాంధ్ర ప్రథమ ప్రబంధమన్న విచారము. వస్తుకవితవిషయమున శ్రీ శర్మగారు "ప్రకృతిని వాస్తవముగా వర్ణించు కవితయనియూ, వస్తుకవు లనగా ప్రకృతి శోభను వాస్తవముగా వర్ణించు కవులనియు" వ్రాసినారు. ముందుగా కొంత చర్చ చేసి, చేసిన సిద్ధాంతమిది (పుట 22). ఇది సిద్ధాంతమైనచో కాళిదాసు బాణభట్టులు ప్రకృతిశోభను వాస్తవముగా వర్ణించువారు కారని తేలును. ఈ తేలుట రసయుక్తి కిష్టమైనట్లు లేదు (పుట 14). అనగా వస్తుకవిత యిది యని సర్వతోభద్రమైన నిర్ణయమీగ్రంథమున జరుగలేదు. ఇక రెండవదైన పద్యౌచిత్యము క్షేమేంద్రుని సువృత్తతిలకమును పట్టుకొని పద్యముల వినియోగౌచిత్యమును చర్చించుటకు పూనుకొనినారు శ్రీ శర్మగారు. ఈ విషయమున అసలు క్షేమేంద్రుని మూలసిద్ధాంతమే పూర్తిగా తర్కశక్తి కాగలదు. స్రగ్ధరావృత్తము శివస్తుతి కర్హముగా నుండునని సిద్ధాంతములేదు. నన్నెచోడుడు గ్రంథము నాపద్యముతో ప్రారంభించుటను గూర్చి శ్రీ శర్మగారు "స్రక్కనగా పూలమాలగదా! స్రగ్ధరుడగు శివుని చరిత్ర మిందావృత్తమైనది. శివస్తుతికిది యర్హముగా నున్నది" అని వ్రాసిరి. పూలమాలను ధరించునన్న ప్రసిద్ధి విష్ణుమూర్తిది. శివుడు నాగములను

ధరించవనియే రూఢి. శ్రద్ధను డనగా శివుడన వీలులేదు. కుమారసంభవ మసలు ప్రబంధమా కావ్యమా అన్న మీమాంస మూడవది. శ్రీ శర్మగారు మహాకావ్య మహాప్రబంధ-ప్రబంధ శబ్దములు సమానార్థకములని వ్రాసిరి. ఆచారముగా వచ్చుచున్న వ్రాత ఇది. నన్నెచోడుని కుమారసంభవము- రామరాజభూషణుని వసుచరిత్రము రెండును ఒకే జాతికి చెందిన గ్రంథములని చెప్పినట్లు. పోనీ మనమీనాడనుకొనుచున్నట్లు ప్రబంధమును కావ్యేతరమైన దానిగా పూర్వులు గ్రహింపలేదు. నిజమే గ్రహించిన మనమేదియో ఆ భేదము వ్రాయవలెనుగదా! ఆ పని చేయలేదు శ్రీ శర్మగారు.

ఈ మూడు విషయములలో నింకను జాగ్రత్తపడి పరిశోధనచేసి వ్రాసినచో ఈ గ్రంథము సర్వసమగ్రమై ఒక ప్రామాణిక గ్రంథమయ్యెడిది. మిగిలిన విషయముల శ్రీ శర్మగారు చేసిన పద్యాలోచన మంతయు సమంజసముగానే యున్నది. అసలు సాహిత్యవిమర్శకులు లేని ఈ కోవలలో ఈ నన్నెచోడుని కవిత్వమును చూచిన తరువాత శ్రీ రాజేశ్వర శర్మగారి గురించి విశ్వాసము పుట్టుచున్నది. కొద్దిలో శ్రీ శర్మగారుత్తమ విమర్శకులు కాగలరు. ఈ గ్రంథము సాహిత్యమునం దభిమాన మున్నవారందరును చదువదగినది. ఈ గ్రంథమును వ్రాయుటలో శ్రీ శర్మగారే యే అభిప్రాయము లెవరెవరినుండి గ్రహించినదియు, ఎవరెవరితో తామెందుకు ఏకీభవించుచున్నదియు, భేదించుచున్నదియును స్పష్టముగా పేర్కొనినారు. అదివారి నిజాయితీ. విమర్శకునకు ముందు కావలసిన ఆ లక్షణము శ్రీ శర్మగారి కున్నది.

— "క్షేమేంద్ర"

# కుమార రుద్రదేవ కవి విమర్శ

84 పుటలు — రచన : అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి

వెల : అమూల్యము — ప్రచురణ : సాహిత్యసంసత్, జనగామ

తెనుగులోని భాస్కర రామాయణ కర్తలను 'గూర్చి అనేక వాదోపవాదా లున్నవి. అయోధ్యా కాండము మాత్రము రచించిన కుమార రుద్రదేవ కవిని గురించిన సమాలోచనమే ఈ గ్రంథము. దీనిని రచించిన శ్రీ అనుముల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు నెల్లూరు జిల్లాలో జన్మించి చిరకాలము వరంగల్లు జిల్లా జనగాములోనే తమ సాహిత్య జీవితము గడిపినారు. వారు రచించిన అనేక గ్రంథాలలో 'బమ్మెర పోతన' ప్రసిద్ధమైనది. ఈ గ్రంథములో కుమార రుద్రదేవ కవి ప్రతాపరుద్రుడేయనీ, తన చిన్న తనములో యువరాజుగా

ఉన్నవి డి రామాయణ భాగ రచన చేసినట్లు శాస్త్రిగారు నిరూపించుటకు ప్రయత్నము చేసినారు. శాస్త్రిగారు తమ డెబ్బదవ యేట ఒసంగిన ఉపన్యాస సారమే వారి అభిమాను లీ గ్రంథరూపంగా ప్రకటించినారు. కుమార రుద్ర దేవకవి రుద్రమదేవి మనుమడైన ప్రతాపరుద్ర మహారాజు తప్ప అన్యుడు కాడని అనేక కారణములుయుక్తియుక్తముగా శాస్త్రిగారు చూపియున్నారు. ఈ గ్రంథము చివర, యేతత్ కవి రచితమైన అయోధ్యాకాండ నుండి కొన్ని పద్యము లెత్తి చూపినారు. ఈ వాదమును నిశ్చయముగా సమర్థించుటకు ఈ కవిగారి హేతువులకంటె ఇంకను బలమైన వాదములు కావలయును. భాస్కర రామాయణమే అయ్యలార్యుని రచన. మూలప్రతి అలహాబాదు విశ్వవిద్యాలయములో నున్నదట. దానినీ, ఆంధ్ర సాహిత్య పరిషత్తులోనున్న మరికొన్ని వ్రాత ప్రతులను పరిశీలించిన యింకను కొన్ని విషయములు బయలు పడవచ్చును. భాస్కర రామాయణము విషయములో కొంత పరిశోధన చేసిన ఆంధ్ర విశ్వవిద్యాలయ పరిశోధకులు కొల్లపాటి శ్రీరామమూర్తిగారి కృషికూడ ఈ సందర్భములో గమనింప దగినది. అనుములు సుబ్రహ్మణ్య శాస్త్రిగారి యీ గ్రంథము తెనుగు సహృదయులందరును చదువదగినది. ఈ గ్రంథ ముద్రణ కనులార వీక్షింపకుండగనే గ్రంథకర్తగారు పరమపదించుట శోచనీయము. అయినను ఈ గ్రంథమున విమర్శకులు చూపిన నూతన మార్గములలో ఇతరు లింకను అన్వేషింపదగి యున్నది.

—"శ్రీ వాత్సవ"

## పూజాపుష్పాలు

(కథలు — వ్యాసాలు)

శ్రీమతి పిల్లలమర్రి సుశీల | శారదా ప్రచురణము

వెల : 75 నయా పైసలు | గుంటూరు

రచయిత్రి రేడియో ద్వారా చేసిన ప్రసంగాలు, కొన్నికథలు యీ పుస్తకంలో ప్రచురించారు. మహిళలకు సులభ గ్రాహ్యమయ్యే శైలిలో సరళంగా ఉన్నాయి వీరి రచనలు.

గృహిణి బాధ్యతలు - పొదుపు, వెల్వాధికారం, మహిళలస్థితి, మన సంగీత సాహిత్యాలు అనేవ్యాసాలు స్త్రీల విజ్ఞానానికి బాగా ఉపకరిస్తాయి.

వీరికథలు క్లుప్తంగా, సూటిగా, రసవంతంగా ఉన్నాయి. ఈ కథానికలు పిల్లలకు బాగా పనికి వస్తాయి.

—"పోతుకూచి"

# కలిపురాణము

( నిర్వచన కావ్యము - 1, 2 భాగాలు )

కావ్యకర్త :
శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి
వెల : ఒక్కొక్క భాగం రు. 2/-

ప్రచురణ :
భాషాపోషక గ్రంథమండలి
అమృతలూరు (గుంటూరు జిల్లా)

ప్రతులకు : గ్రంథకర్త, పి. బి. యన్. కాలేజి
నిడుబ్రోలు, (గుంటూరు)

సాహిత్యం - ఒక్క సాహిత్యమే గాదు—ఏ లలితకళ అయినా కానీయండి, పదును దేరిన చురకత్తిలాంటిది. ఆ కత్తి శిష్టుల చేతబడితే లోక సంరక్షణం జరుగుతుంది. దుష్టుల చేతబడితే లోకం పీడాకరంగా పరిణమిస్తుంది. ఫలితం ఉపయోగించేవారి వ్యక్తిత్వాన్నిబట్టి, యోగ్యతనుబట్టి ఉంటుంది.

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరిగారు మొదటి కోవకు చెందిన మనీషులు. ప్రాచీన, ఆధునిక సాహిత్యములను అవలోకనము చేసిన దిట్ట. కమ్మని కవితాసవమును అందించగల మేటి. వారు రచించిన 'వైదిక వాఙ్మయ చరిత్రము' తోనే వారి పేరు ఆంధ్రదేశంలో ప్రసిద్ధి కెక్కినది.

కొన్ని వేల సంవత్సరాల క్రితం స్వార్థపరులు తమకు అనుకూలంగా సృష్టించుకొన్న సూత్రాలే ఈనాటికీ అమలులో వుండటం చౌదరిగారిని విస్మయ చకితులను చేసింది. పాక్షిక దృష్టితో చేయబడిన సాంఘిక నిబంధనలూ, నియమాలూ భారతదేశంలోని కొన్ని వర్గాలను నిర్వీర్యం చేసిన వనడంలో ఎంత మాత్రం సందేహం లేదు. సమాజంలో అనేక రూపాలలో జరుగుతున్న అన్యాయాలకు చౌదరిగారి హృదయం ఎంతగా కుమిలిపోయిందో 'వర్ణవ్యవస్థ' చదివితే తెలుస్తుంది.

మచ్చుకి రెండు పద్యాలు చూడండి.

'మొగమున బాపఁడే కలిగె ముందుగ దేవుని కందువల్లనే
సుగతికి వాఁడు నోఁచుకొనె; శూద్రుఁడు పాదముకోనఁ బుట్టి యీ
జగమున సేవజేయుటకె చాలినవాఁడఁట; బ్రహ్మపాదమా
మొగమున కన్న నీచమను ముఖ్య విశేషము తోఁచెనందురా !
అవయవ సన్ని వేశమున కట్టి విధంబుగ నుచ్చ నీచముల్
చివరికిఁ దేల్తురా! యొక విశేషము చెప్పెద, విష్ణు పాద సం
భవయగు గంగ కెవ్వరు నపస్యలు సేయరు? పైఁగదాని వా
శివుఁడె శిరంబుపైఁ బొదివి చెల్వుగ గౌరవ మిచ్చి మెచ్చఁడా!'

జాతిలో నిస్తబ్ధతను పోగొట్టి, చైతన్యవంతం చేయడానికి, ధర్మ కంఠమెత్తి పీడిత ప్రజానీకానికి చౌదరిగారేమి ప్రబోధిస్తున్నారో తెలిసికొనేందుకు ఈ గ్రంథ పఠనం చాలా అవసరం. అయితే మన ప్రాచీన కవులు రచించిన అష్టాదశ పాత పురాణాలుండగా ఇప్పుడీ 'కలిపురాణం' ఎందుకు కావలసి వచ్చింది? అనే ప్రశ్న కలగవచ్చు. దానికి కవిగారి సమాధానం చూడండి.

'కలియుగమందుఁ బుట్టుట యొకానొక కర్మమటంచు నేడ్పు పె
ద్దలకును బుద్ధిసెప్పి తన ధర్మము చక్కఁగనేల నాల్గు ది
క్కులఁ బ్రచుర ప్రచారములఁ గోరి ప్రబోధము సేయునంచు నేఁ
దలచి రచించి దీనిని ముదంబున లోకము చేతికిచ్చితిన్'

'కలిపురాణం' చదవడం ప్రారంభించడంతోనే కవిరాజు, శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారి 'సూతపురాణం' జ్ఞాపక మొస్తుంది. సూతపురాణం లోని ఛాయలు కొన్ని ఈ కలిపురాణంలో గోచరిస్తున్నాయి. ఏమయినప్పటికీ ఈ గ్రంథం చదువుతున్నప్పుడు ప్రతి పుటలోనూ, ప్రతి పద్యంలోనూ, కవి యొక్క నిర్మల హృదయమూ, నిష్పాక్షిక బుద్ధి, ధర్మం పట్ల వారికున్న అచంచల విశ్వాసం, న్యాయంపట్ల వారికున్న ప్రగాఢమైన ఆసక్తి ప్రస్ఫుటంగా కనిపిస్తున్నవి. చక్కని శయ్య, కమ్మని పదాల పోహళింపు, ఝరీసదృశమైన ఆవేగం చౌదరిగారి సొత్తు. కలిపురాణం రెండు భాగాల్లోనూ కొన్ని ఖండికలలో వారి లేఖిని చూపించిన శిల్పం అనన్యమైనది.

ఆంధ్ర సాహిత్యంలో అసంఖ్యాకంగా వెలసిన చంపూ కావ్యాల మార్గా న్ననుసరించకుండ, ఈ కావ్యంలో సత్యనారాయణ చౌదరిగారు కొంతవఱకు సంస్కృత భాషా కావ్యధోరణినే అవలంబించారు. రసపరిప్లుతికి, కథాగమనానికి భంగం వాటిల్లకుండా నాలుగు వృత్తములతోనే కావ్యాన్ని నడిపించి చదువరులకు 'హాయి' గలిగించారు.

ప్రతి వారూ చదువదగ్గ ఉత్తమ కావ్యం కలిపురాణం. ప్రతి గ్రంథాలయంలోనూ ఉండవలసిన గ్రంథం ఈ కలిపురాణం. ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని రచించిన సత్యనారాయణ చౌదరిగారిని మనఃపూర్వకంగా అభినందిస్తూ, వారి నుండి ఇంకా యీ రకమైన గ్రంథాలు శతాధికంగా రావాలని ఆకాంక్షిస్తున్నాము.

— త్రిపురనేని సుబ్బారావు

# గడిచిన ఘడియలు

రచన :
డా|| పోతరాజు రామమూర్తి.

ప్రచురణ :
గంగా పబ్లికేషన్స్.

వెల: రు. 3-50.

P. B. No. 122 గుంటూరు.

అనువాద నవలాసాహిత్యపు ఉరవడిలో ఉక్కిరి బిక్కిరి అవుతూన్న నేటి తెలుగునాట అక్కడ అక్కడా ఒక్కొక్క స్వతంత్ర నవల వెలసిందీ అంటే మనస్సుకు చల్లదనమూ- మేధస్సుకు సంతృప్తి లభిస్తుందంటే అతిశయోక్తికాదు. చదవాలి అని ఉత్సాహ పడతాం. ఆ ఉత్సాహంతో చదివినవారు ప్రస్తుత విమర్శనీయగ్రంథమైన 'గడిచిన ఘడియలు' చదివాక భంగపడక తప్పదనే చెప్పాలి. రచయిత తెలుగు గడ్డలో పుట్టుకతో ఆంధ్రుడై తెలుగు భాషలో వ్రాయడం సంభవించిందే కాని మరే కారణంచేతా యిది తెలుగు వారికథ అని చెప్పుకునే సావకాశం లేదు. పరిచయకర్త 'గ్రంథం సుప్రసిద్ధ బెంగాలీ నవలకు అనువాదంలా తోస్తుంది' కాని స్వతంత్ర రచన అని చెప్పుకోడం రచయిత ఎంత గర్వకారణంగా చెప్పుకున్నప్పటికీ పఠిత కా విషయం తోచే సావకాశం లేదు. స్వతంత్ర రచన అనుకుని చదివాక అనువాద మనుకుంటేనే పఠిత సజావుగా వెళ్లగలననిపిస్తుంది. కథ ఎంత వంగదేశ వాతావరణంలో జరిగినదైనా రచయిత కనీసం తాను తెలుగువాడిననీ మధ్య మధ్య గుర్తుంచుకున్నా బాగుండేదనిపిస్తుంది. అంతేకాకుండా భాషావిషయికంగా కూడా రచయిత అనువాద ధోరణి అవలంబించటం మరీ చింతనార్హం. కనీసం యిందులోనైనా సహజ పద్ధతినవలంబిస్తే బాగుండేది.

ఆదర్శపురుషుడు విప్లవవాది అని నవలలో నలుగురు పాత్రలచేత పదేపదే ప్రశంసింపబడుతూ, తన ఆశయాలకూ ఆదర్శాల సాధనకూ వివాహం ప్రతిబంధక మనినమ్మినట్లు భ్రమించిన ఒకానొక యువకుడు యిల్లుగలవారి కుమార్తెని భవానీ దేవి ప్రేమబంధంలో యిరుక్కుని, తప్పుకోలేక పెళ్లాడి, కారణాలని పఠిత లెవ్వరికీ తట్టని కారణాలతో భార్యతిరస్కారాన్ని పొంది అటుపైన తానువారిని తిరస్కరించి తిరిగి ఆదర్శాల రైలెక్కడం- సూక్ష్మంగా కథయిది. ఇది నవలకు తగ్గకథేనా అనే సందేహం అనవసరం. ప్రారంభంలో డాక్టరుగారు (రచయిత డాక్టరు పోతరాజు రామమూర్తిగారు) యిది తమ స్వీయ చరిత్రేనన్న విషయం తోపింప జేసేటట్లుగా ఏవో తాడు బొంగరమూ లేని స్మృతులేవో తనను ముసురుకొని వస్తూంటే తనమనస్సంతృప్తికోసం వాటికి ఆకారంకల్పించక తప్పనిసరి అవుతోంది. కాబట్టి వ్రాసుకున్నానని చెప్పనే చెప్పుకున్నారు. అందుచేత నన్ని వేళాలోక దానిలో ఒకటి పొత్తుకుదరటంలేదనీ, నాలుగు ముక్కలుతెచ్చి ఒకచోట ఎగుడు దిగుడుగా అతికినట్లుందని కూడా అనుకోపని లేదు.

రచయిత ప్రారంభంలో చెప్పుకున్నట్టు గ్రంథం కేవలం తన హృదయ భారానివారణార్థం కాని ప్రకటించి ప్రజలముందు పెట్టటం ఆయన అభీష్టం కాదే కాదు, అందుచేత పాత్రచిత్రణ మొదలయిన విషయాలను గురించిన విమర్శ రచయిత కవసరమేలేదని తెలుస్తున్న విషయమే. గ్రంథం ప్రకటితమైంది కాబట్టి కొంత చెప్పకతప్పదు. రచయిత చెప్పలోయే ప్రతి విషయమూ సామాజికదృష్టితో విమర్శించుకుంటూ వ్రాసుకుపోవాలి. పాఠకుడి విశ్వాసంమీద మనసుంచే అందుకు తగిన ఆధారమూ, ఉపాధి సన్నివేశాలకు కల్పించాలి రచయిత. డాక్టరుబాబు (కథానాయకుడు) ఏవో అర్థం పర్థంలేని కారణాలతో రెండు మూడు సార్లు జైలుకు వెళ్లినట్లు చెప్పడంతో, నలుగురినోట దీక్షాపరుడని స్వతంత్రుడని, విప్లవాది అని ప్రశంసింప జేయటంవల్ల అతడెంత దేశభక్తుడో, ఏలాంటి విప్లవవాదో అర్థంచేసికోవటం పఠితకు కష్టం. అలాగే పెళ్లిముహూర్తం పట్టుదలగా అమావాస్య నాడు పెట్టించటానికి నలుగురితోపాటు ఉత్సాహం చూపిన నాయకుడు వివాహ బంధంగా తాళికట్టు పవిత్రతను గురించి ఉపన్యసించటం పఠిత నమ్మలేని విషయం. ప్రేమించి పాదాభివందనాలు చేసే పరమ భక్తురాలయిన భార్య భర్తను రాక్షసుడని దూషించి సంబంధం త్రెంచుకున్నట్టు ప్రవర్తించటానికి తగినంత కారణంకాని సందర్భ శుద్ధిగాని కనిపించదు. దాంపత్య జీవితం మినహాగా అన్నిటా చేదోడుగా వున్న కుసుమ మధ్యలో మాయమై చివరకు కలిసినట్టున్నా, మహిళా సంఘాల కార్యక్రమాలను గురించి అంతగా ఉపన్యసించిన కుసుమ అంతత్వరలో చనిపోవాల్సిన పనిలేదు. తనలో అజ్ఞాతప్రేమకు ప్రతిఫలంగా నాయకుడిచేత దహనసంస్కారాలు చేయించు కుందనుకోవటం సాధ్యం కాదేమో!

దేవుడు, స్వర్గనరకాలమీద చర్చలు రచయిత అభిప్రాయాలకు తెలియజెప్ప టానికి తోడ్పడతాయో లేదోకాని సందర్భశుద్ధి లేదు.

సంస్కృత పదాలుపయోగించటంలో మోజుచూపించిన రచయిత, కర్ఫ్యూ, కంట్రోలు, మొదలైన ఆంగ్లపదాలు తరచు వాడడం బాగులేదు. సహస్రబాకులు, ధుమ్మసుకి, మొదలయిన పదాలు యిక ముందయినా దిద్దుకుంటే మంచిది.

పరిచయకర్త 'పరిచయం' తో మనం ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా అది వారికి గ్రంథకర్తలకు వున్న అపూర్వస్నేహానికి తార్కాణం. నేర్చుకోవలసిందేదీ లేదు నేర్చుకోకూడనిదీ లేదు. అంచేత ఫరవాలేదు. కాలక్షేపానికి ఓమారు చదుకోదగిన నవల 'గడిచిన ఘడియలు'.

—"సీతా కళ్యాణి"

## చదువెందుకో తెలుసా?

రచయిత:
బొడ్డుపల్లి సుబ్బారావు

పేజీలు : 64
వెల : 1-0-0

ప్రతులకు: బొడ్డుపల్లి సుబ్బారావు, భూషాయపాలెం
రమణాయపాలెం పోస్టు, వయా-జా పిట్ల, (గుం జి.)

ఇది ఒక విద్యా ప్రచార నాటకము—ఇందలి భాష గ్రామ్యము. దాదాపు పాత్రలన్నీ గ్రామీణ వాతావరణమునకు చెందినవే. చదువు రానివారు, చదువు కొనిన కొందరు జిత్తులమారి వ్యక్తులచే మోసగింపబడుతున్నట్లు చిత్రీకరించారు రచయిత. రామయ్య నిరక్షరాస్యుడు. ధర్మబుద్ధి. దైవచింతనగల రైతు. కుటుంబయ్య చదువుకొనికూడ సద్బుద్ధిలేని మనిషి. అమాయకుడైన రామయ్యను మోసగించి ధనార్జనచేయ పూనుకున్న కుటిలుడు. మిగతా పాత్రలన్నీ వీరికి జానటగా నిలచినవే. పోస్టుమాస్టరు ఉదంతం అతిశయోక్తిగా వున్నది. సుదీర్ఘ సంభాషణలను క్లుప్తీకరిస్తే స్కూళ్లలోను, పల్లెపట్టులందు ప్రదర్శనార్హముగా వుంటుం దీ నాటకం.

—— అరుణ్

# వేసవి హిందీ తరగతుల ప్రారంభోత్సవము

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర పక్షాన ఏర్పాటు చేయబడిన వేసంగి హిందీ తరగతుల ప్రారంభోత్సవము 27-4-60న సాయంత్రం 6 గంటలకు హైదరాబాదులోని ఆంధ్ర సభ కార్యాలయ ప్రాంగణములో జరిగినది. డా. శ్రీ ఎం. చెన్నారెడ్డి గారు అధ్యక్షత వహించిరి. 1959 ఆగష్టులో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రములు, హైదరాబాదులో సర్వప్రథమ, ద్వితీయ, తృతీయులుగా ఉత్తీర్ణులైనవారికి పుస్తకాలు బహుమతులుగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ విద్యా శాఖా డైరెక్టరు డాక్టర్ శ్రీ ఎస్. రామ్‌లాల్ గారొసంగిరి.

ప్రార్థనానంతరం దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర కార్యదర్శులు శ్రీ భాలచంద్ర ఆప్టే, శ్రీ చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ గార్లు స్వాగతమొసంగి సభ కార్యకలపాలను సంగ్రహముగా వివరించిరి. డాక్టర్ రామ్‌లాల్ తరగతులను ప్రారంభించుచు, సభ చేస్తున్న హిందీ ప్రచార కార్యాన్ని అభినందించిరి. ప్రభుత్వ సహాయం వీలైనంత ఎక్కువగా లభించ గలదనీ, అయినప్పటికీ సభ తన కాళ్ల మీద నిలబడి హిందీ ప్రచారాన్ని నిర్విఘ్నంగా కొనసాగించడానికి ముందుకు సాగా లన్నారు.

డాక్టర్ ఎం. చెన్నారెడ్డి గారు తమ అధ్యక్షోపన్యాసంలో '40 సంవత్సరాలుగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ హిందీ ప్రచారానికై చేస్తున్న కృషి గర్వించదగినదనీ, ఇలా ఇంకా ఇలా అన్నారు.' దక్షిణ భారత హిందీ ప్రచార సభ వ్యవస్థకు ఇతర హిందీ సంస్థల వ్యవస్థకు వ్యత్యాసం ఉన్నది. సభ హిందీతో పాటు ఆ యా ప్రాంతీయ భాషలకు ఎంతో ప్రాధాన్యమిస్తూ అందుకై కృషి చేస్తున్నది. దీని కుదాహరణగా ఆరు సంవత్సరాల నుండి ఆంధ్ర సభ ద్వారా తెలుగు సాహిత్య మాస పత్రిక "స్రవంతి"ని తీసుకొనవచ్చును. స్రవంతి తెలుగులో ఉత్తమ సాహిత్యా న్నందిస్తూ ప్రత్యేక స్థానాన్ని, గౌరవాన్ని పొందుతున్నది. జాతీయ భాష యగు హిందీని ప్రత్యేక శ్రద్ధతో ప్రతి ఒక్కరూ చదివి దాని ఉన్నతికి తోడ్పడవలసినదిగా కోరారు

హైదరాబాదు హిందీ ప్రేమి మండలి, కార్యదర్శి శ్రీ మధుసూదన్ జీ తమ హృదయపూర్వక అభినందన సమర్పణ చేసిరి. జనగణమనతో కార్యక్రమం ముగిసినది.

# ప్రకృతి శిక్షణ శిబిరము
## (మే నెల 20 వ తేది నుండి 30 వరకు)

హైద్రాబాదులోని అమీర్ పేట ప్రకృతి చికిత్సాలయంలో మే నెల 20వ తేదీనుండి 30వ తేదీ వరకు ప్రకృతి శిక్షణ శిబిరం నడుప నిశ్చయింప బడినది. దేశంలోని ప్రకృతి చికిత్సా ప్రవీణులు తమ తమ అనుభవములను ఈ శిక్షణ శిబిరంలో వెల్లడించుటకు ఆహ్వానింపబడిరి.

ఈ శిబిరంలో పాల్గొను వారలకు, చికిత్సాలయం తరపున ఉచిత గృహవసతులు ఏర్పాటు చేయబడినవి. భోజనపు ఖర్చులు ఎవరివి వారే భరించ వలెను, ప్రతివారు తమ వెంట, పడక, బట్టలు, ప్లేటు, చాకు, గ్లాసు, చెంబు తెచ్చుకొనవలెను.

ఈ శిబిరంలో ప్రకృతి జీవనము, చికిత్సలు, యోగాసనములు, ఆహార నియమముల శిక్షణ యివ్వబడును. శిబిరంలో పాల్గొన దలచిన వారు మే నెల 10వ తేది నాటికి మాకు తెలుపవలెను.

### గ మ ని క

1. స్త్రీలకు ప్రత్యేక ఏర్పాట్లు గలవు.
2. భోజనమునకు రోజుకు రెండు రూపాయలు ఖర్చగును. 10 రోజుల పైకము ముందుగానే జమచేయవలెను. కూరలు, పండ్లు, పాలు, మజ్జిగ మాత్రమే ఆహారములో ఉపయోగించవలెను.
3. 18 సంవత్సరములలోపు వారికి శిబిరములో ప్రవేశము లేదు.
4. ఎవరి పనులు వారే చేసుకొనవలెను, మరియు సాముదాయిక సఫాయి, ఆహార పదార్థముల సేకరణ, తయారి మొదలైన కార్యక్రమములలో శిబిరాధిపతి సూచనల ననుసరించి ఎల్లరు పాల్గొన వలసి యున్నది.
5. శిక్షణ, హిందీ, తెలుగు భాషలలో యివ్వబడును.

ప్రకృతి చికిత్సాలయం,
అమీర్ పేట, హైద్రాబాద్-16

ఇట్లు
ప్రకృతి శిబిర వ్యవస్థాపకులు

# ఆంధ్ర ప్రదేశ్‌లో దక్షిణ భారత హిందీ ప్రచార సభ

## హిందీ ఆర్గనైజర్లు



(1) శ్రీ చంద్రభట్ట అప్పన్నశాస్త్రి.
దక్షిణాంధ్ర మండల
ఆర్గనైజరు.
ప్రధాన కేంద్రం:- వేణుగోపాల్ నగర్,
అనంతపురం.



(2) శ్రీ నంబూరి శేషాద్రాచార్యులు.
మధ్యాంధ్ర, పూర్వాంధ్ర
మండల ఆర్గనైజరు.
ప్రధాన కేంద్రం:- దక్షిణ భారత హిందీ
ప్రచార సభ-ఆంధ్ర విజయవాడ-2



(3) శ్రీ అడుసుమిల్లి కృష్ణమూర్తి.
తెలంగాణా ఆర్గనైజరు.
ప్రధాన కేంద్రం:- దక్షిణ భారత హిందీ
ప్రచార సభ-ఆంధ్ర, హైద్రాబాదు-4

Edited Printed and Published by Ch. Lakshminarayana Sarma, Secret